# రామనామ మహిమ





## గాంధీజీ

సంకలనము, అనువాదము

మోదుకూరు మల్లికార్జునరావు

ఎం. ఏ., బి. యిడి.



మహాత్మాగాంధీ యోగ, ఆరోగ్య

పరిశోధనాలయము.

శివరాంపల్లి, హైదరాబాదు-6

వెల ఒక రూపాయి

ప్రతులు
1000

మొదటి ముద్రణ
**1969**



ఇతర రచనలు

భగవద్గీత, ఉపనిషత్తుల సారము రు. 1—00

అచ్చులో

1. గీతామాత సందేశము—గాంధీజీ
2. యోగసాధన.
3. సూర్యనమస్కారములు.

ప్రతులకు

మోదుకూరు మల్లికార్జునరావు,
డైరెక్టర్, మహాత్మాగాంధీ
యోగ, ఆరోగ్య పరిశోధనాలయము
శివరాంపల్లి—హైదరాబాదు—౮
లేక
3—4—610/2 నారాయణగూడ,
హైదరాబాద్—29

లలితా ప్రెస్, ఖైరతాబాదు,
హైదరాబాద్—4

# ప్రస్తావన

గాంధీజీ సర్వసాధారణంగా రాజకీయవేత్తగా తలచ బడుతుంటాడు. స్వాతంత్ర్యపోరాట సందర్భములో ఆయన నడపిన సత్యాగ్రహాలు, ఉపవాస దీక్షలు, ప్రార్ధనా సమావేశాలు ఆయన వ్యవహార చతురతకు, కుటిల నీతిజ్ఞతకు తార్కాణములుగా భావించి తృప్తి చెందటము నేటిరాజకీయవేత్తలకు, విద్యావంతులనబడువారికి పరిపాటి అయినది. తన జీవితమును ఆత్మ సాక్షాత్కారమునకు గడపుచుంటి ననియు అందులకు సత్యాహింసలు సాధనములనియు ఎన్నో పర్యాయములు గాంధీజీ చెప్పియుండెను. తన స్వీయ చరిత్రను "సత్యముతో నేను జరిపిన పరిశోధనలు" అని వ్రాసి ప్రపంచము ముందు ఉంచుట గాంధీజీ స్థైర్యమును, ఆత్మ విశ్వాసమును, సత్యదీక్షను తెలుపును.

గాంధీజీ 1925 లో ఆత్మకథయందు తన జీవిత లక్ష్యమును గురించి ఇట్లు వ్రాసెను: "నేను పొంద గోరునదేమి ? ఈ ముప్పది సంవత్సరములనుండియు నేను ఎందులకు కృషి చేయుచున్నానో అది ఆత్మసాక్షాత్కారమునకు, భగవంతుని ముఖాముఖిని చూచుటకు, మోక్షమును పొందుటకు. నేను బ్రతుకుట, వ్యవహరించుట ఈ లక్ష్య సాధనకే. నేను మాట్లాడునది, వ్రాయునది, రాజకీయరంగములో నాకృత్యములు ఈ లక్ష్యమును చేరుటకే గాంధీజీ తనజీవిత లక్ష్యమును ఇంత స్పష్టముగాచెప్పి తదనుగుణముగా వ్యవహరించియుండ ఆయనను రాజకీయవేత్తగాను, కుటిల నీతిజ్ఞునిగాను, లౌక్యునిగాను చూచుట వారి మనః ప్రవృత్తిని మాత్రమేచాటును. గాంధీజీకి తన లక్ష్యమగు ఆత్మ సాక్షాత్కారమును సాధించుటకు అండదండగా ఉపకరించిన మహా మంత్రము రామ నామము.

సాధారణముగా రాముడనగనే దశరధ నందనుడు, సీతాపతి, రావణ సంహారిగా తలచుట పరిపాటి. కాని గాంధీజీ ఆరాముని సీమిత పరిధి నుండి తొలగించి సర్వాంతర్యామిగను, నిర్వికారుడు, నామ రహితు డగు పరమాత్మగను భావించి సాధనచేసెను. తానుఆరాధించిన రాము డెట్టి వాడో గాంధీజీ ఇట్లువర్ణించెను. "ఎవరైననూ రాముడు, రామ నామ ఉచ్చారణ కేవలము హిందువులకేనని, ముస్లిములు రామధున్ నందు ఎట్లు పాల్గొందురని అనినప్పుడు నాలోనేను నవ్వుకొందును. ముస్లిములకు ఒకదేవుడు, హిందువులకు, పార్శీలకు, క్రైస్తవులకు మరొకదేవుడు కలడా? కాదు. సర్వ శక్తియుతుడు సర్వాంతర్యామి ఒకడే కలడు. ఆయనకు వివిధమైన పేర్లుపెట్టిరి. మనము మనకు పరి చయమైనపేరుతో ఆయనను జ్ఞప్తి యుంచుకొందుము. నా రాముడు దశరధుని కుమారుడైన చారిత్రాత్మక రాముడు కాడు. ఆయన శాశ్వతు డైన, జన్మలేని, ఋణముకూడ లేకుండ ఉండనివాడు. ఆయననే నేను పూజింతును. కేవలము ఆయన సాయమునే నేను కోరుదును" గాం ధీజీ ఆరాధించిన రాముడు సీమితుడుగాక అసీమరూప, శక్తి సంప న్నుడు, సర్వమతములకు మూలముఅయి ప్రతి జీవియందు సూక్ష్మ ముగా విరాజిల్లుచున్న పరమాత్మయని స్పష్టమగుచున్నది.

గాంధీజీ రామనామ ప్రచారమేగాక రామరాజ్య స్థాపన భారత దేశమున జరుగవలెననికూడ కాంక్షించెను. ఇచటకూడ గాంధీజీకి దశరథనందనుడైన రాముని రాజ్యమువంటి రాజ్యమనిగాని, ప్రజా తంత్ర వ్యవస్థగాక హిందూ రాజరికమును మరల భారత దేశమున స్థాపించవలెననిగాని గాంధీజీ భావనయని తలచుట సరిగాదు, రామ రాజ్యమన్నప్పుడు గాంధీజీ మనస్సులో తులసీదాసు రామాయణమున రామరాజ్యవర్ణన మెసలుచుండును. అట్లు భావించుటకు కారణము తులసీ రామాయణము తనను చాల ప్రభావితుని చేసినట్లు గాంధీజీ

"ఆత్మకథ" యందు వ్రాసియుండెను. తులసీదాసు రామరాజ్య వర్ణనను ఇట్లు చేసెను.

"దైహిక దైవిక భౌతిక తాపా, రామరాజ్య నహికాహుహి
వ్యాపా!
సబనరకరహి పరస్పర ప్రీతి, చలహిస్వధర్మ నిరతిశృతి నీతి॥
నహిదరిద్ర కోవూదుఖీన హేనా, నదికోవూ అవుధనలక్షణహీనా,
సబగుణజ్ఞ పండిత సబజ్ఞాని, నహిక్రృతజ్ఞకపట సమానీ॥"

అనగా రామరాజ్యమున ప్రజలు దేహసంబంధమైన, దైవ సంబంధమైన, భౌతికమైన ఎట్టి ఈతి బాధలు లేక సుఖముగా నుండిరి. అచట ప్రజలు పరస్పర ప్రేమ, సహకారములతో తమ తమ నియమిత కర్మల చేసుకొనుచూ జీవించిరి. రామరాజ్యమున బీదరికము, దారిద్ర్యము లేదు.

ప్రతిపౌరుడు ఆర్థిక లేమివలన దుఖితుడుగా లేదు. అందరు సద్గుణములతో తులతూగుచుండెను. వారు గుణవంతులు, జ్ఞానులు అయి తమ సుఖ, శాంతిమయ జీవితమునకు భగవంతునికి కృతజ్ఞులై నిష్కపటులై జీవించుచుండిరి.

ఆదర్శ శ్రేయోరాజ్య లక్షణములివి. నేటి ప్రజాతంత్ర రాజ్యముల లక్ష్యము శ్రేయోరాజ్యమేకదా! భారతదేశము కూడ ఈలక్ష్యమును చేరుకొనవలెనని గాంధీజీ కాంక్షించుట సంకుచితమా లేక ఆయన యొక్క అతి విశాల హృదయ చిహ్నమా? కాన గాంధీజీ ఆరాధించిన రాముడు, సర్వప్రపంచకర్త, నామ రూప రహితుడు, సర్వశక్తి సంపన్నుడు అయిన పరమాత్మ. ఆయనకోరిన రామరాజ్యము శ్రేయోరాజ్యము యొక్క పరాకాష్ఠను అందుకొనవలసిన ధర్మరాజ్యము.

గాంధీజీ తన ఈ భావములను "ఆత్మకథ" యందు హరిజన్ పత్రిక మూలమున, ప్రార్థనా సమావేశములందు దేశవాసులకు చెప్పి యుండెను. గాంధీజీ ఈ భావములు తాత్కాలిక విలువ గలవిగాక శాశ్వతముగ అనేక కాలములు ప్రజలు అవగతము చేసుకొని తమవ్యక్తిగత, సమాజ జీవితమును శాంతి సుఖము చేకూర్చగల శక్తి గలవి. గాంధీజీ రామనామమునుగురించి వ్యక్తపరచిన భావములను సంకలితపరచి, సామాన్య ప్రజానీకమునకు అవగాహనయగు వ్యావహారిక, సులభ తెలుగు భాషయందు అనువదించియుంటిని. గాంధీజీ భావములు సంకుచిత మనస్తత్వమును పటాపంచలుచేసి విశాలబుద్ధి ఏర్పడుటకు తోడ్పడగలవు. ఈ కార్యమున నాడుదుతా భక్తిని ప్రవర్శించుటకు అవకాశము కల్గించినందులకు సర్వాంతర్యామికి కృతజ్ఞత తెలుపుట నావిధి. ఇందలి దోషములను గమనించక మహాత్ముని ఉన్నత భావములను మాత్రము చదువరులు అవగతము చేసుకొందురుగాక !

ఇట్లు,

మోదుకూరు మల్లికార్జునరావు.

# రామనామ మహిమ
## బాల్యమందు నాటబడిన సద్బీజము



గాంధీజీ 6,7 సంవత్సరముల బాలుడుగా నుండగా స్కూలునకు పోవుట ప్రారంభించెను అతడు 17 సంవత్సరముల వయస్సు వచ్చువరకు స్కూలులో వివిధ విషయములు నేర్చుకొనెను గాని మత సంబంధమైన విషయములు ఆ సమయములో తనకు నేర్పనందుకు తరువాత చాల విచారపడెను ఎట్టి శ్రమయు లేకయే ఉపాధ్యాయులు చేయవగిన మత సంబంధ విషయములబోధ వారు తనకు చేయనందులకు ఆయన బాధను వెలువరించెను. ఏది తనకు స్కూలునందు లభింపలేదో అది తన చిన్నతనపు దాది ద్వారా లభించినదని చెప్పుచూ గాంధీజీ "ఆత్మకథ"లో ఇట్లు వివరించెను :

"నాకు దయ్యములు, భూతములు అనిన భయముండెడిది. రంభ (తన దాదిపేరు) ఈ భయ నివారణగా రామనామము నుచ్చరించుట నాకు సూచించినది. నివారణోపాయముపై కంటె ఆమెపై నాకు అమిత విశ్వాసముండెడిది. అందుచే దయ్యముల, భూతముల భయ నివారణకు అతి బాల్యావస్థ నుండియే నేను రామనామము నుచ్చరించుట ప్రారంభించితిని. సహజముగా అట్లు స్వల్పకాలమే జరిగినది. కాని పసితనమున నాటబడిన ఈ సద్బీజము నిష్ప్రయోజనము కాలేదు. ఆ ఉత్తమురాలు ఆ సద్బీజమును నాటుట వల్లనే నాకు ఈ నాడు రామనామము తిరుగులేని ఔషధముగా నున్నది."

చిన్నతనములో తనలో నాటబడిన రామనామ బీజము అంకు రించుటకు తన కుటుంబ వాతావరణము తోడ్పడినట్లుగాంధీజీచెప్పెను: "నాపై హెచ్చు ప్రభావమును కలుగజేసినది నేను నా తండ్రి వద్ద రామాయణముచదువుట. అనారోగ్య కాలములో కొంత సమయము నా తండ్రి పోర్బందరులో నుండెను. అచటప్రతిదినము ఆయన రామా యణమును వినుచుండెడివాడు. చదువునది గొప్ప రామ భక్తుడు బిలే శ్వరవాసియగు లాధామహారాజు. ఆయన తనకుగల కుష్ఠురోగమును ఎట్టి మందులచేగాక బిలేశ్వరాలయము నందలి మహాదేవ విగ్రహమునకు పూజకై ఉపయోగించి అటుతరువాత పారవేయబడిన బిల్వపత్రములను కుష్ఠుగల భాగములకు కట్టుచూ, నియమముగా రామనామము చేయుచూ నివారించుకొనెనని చెప్పుకొనెడివారు. అది నిజమో కాదో కాని మేము అగాధను నమ్మితిమి. నిజమునకు లాధా మహరాజు రామాయణము చదువుట ప్రారంభించునప్పటికి అయన శరీరమునకు కుష్ఠు పూర్తిగా పోయినది. అయనకు శ్రావ్యమైన కంఠముండెడిది. ఆయన దోహాలు, చౌపాయీలు గానము చేయుచు వానిని వివరించు నప్పుడు తన్నుతాను మరచి శ్రోతలను తనతో తల్లీనుల చేయువాడు. ఆ సమయమున నాకు 13 సంవత్సరములు అయియుండును. కాని అయన చదువునకు ముగ్ధుడనయిపోవుట నాకు బాగుగా జ్ఞప్తి యందు న్నది. రామాయణము నెడల నాకుగల భక్తికి అది పునాది వేసెను. తులసీ రామాయణము భక్తి సాహిత్యమునందు అతిగొప్ప గ్రంథమని నేటికిని నేను విశ్వసించును."



# నా రాముడు ఎట్టివాడు

ఎవరైనను రాముడు, రామనామ ఉచ్చారణ, కేవలము హిందువులకేనని, అందువలన ముస్లిములు అందు ఎట్లు పాల్గొందురని అనినప్పుడు నాలో నేను నవ్వుకొందును. ముస్లిములకు ఒక దేవుడు, హిందువులకు, పార్శీలకు, క్రైస్తవులకు మరొకడు కలడా? కాదు, సర్వశక్తియుతుడు, సర్వాంతర్యామి ఒకడే కలడు. ఆయనకు వివిధమైన పేర్లు పెట్టిరి. మనము మనకు పరిచయమైన పేరుతో ఆయనను జ్ఞప్తియుంచు కొందుము.

నా రాముడు, అనగా మనము ప్రార్థనలు జరుపు రాముడు, దశరథుని కుమారుడైన చారిత్రాత్మక రాముడుకాడు. ఆయన శాశ్వతుడైన, జన్మలేని, క్షణముకూడ లేకుండ ఉండనివాడు. ఆయననే నేను పూజింతును. కేవలము ఆయన సాయమునే నేను కోరుదును. అట్లే మీరుకూడ చేయవలెను. ఆయన అందరకు చెందినవాడు. అందుచేత ఒక ముస్లిముగాని, మరొకరుగాని ఆయన నామమును గ్రహించుటకు ఏల అభ్యంతరము పెట్టవలెనో కారణము నాకు కనుపించుటలేదు.

ఆయనలో నాకు నమ్మికలేదని నీవనవచ్చును. ఆయన ఆజ్ఞలేనిది నీవు ఒక్క శ్వాసనుకూడ గ్రహించలేవని నీకు తెలియదు. ఆయనను ఈశ్వరుడని, అల్లా, భగవంతుడు, అహూరా మాజరా అని పిలుతుము. మానవులెందరో అన్ని అసంఖ్యాక నామములాయనకు కలవు. ఒక క్షణము కూడ ఆయన లేక ఉండడు. ఆయనయే శ్రేష్టుడు ఆయనకంటె గొప్పవాడులేడు ఆయన కాలరహితుడు రూపరహితుడు, దోషరహితుడు. నా రాముడట్టివాడు. ఆయనయే నా ప్రభువు. యజమాని. కాని రాముడు దేవుడని గుర్తించవలసిన బాధ్యత అందరకు ఏమియులేదు. ఆయనను అల్లాయని లేక శబ్దసౌందర్యమునకు లోపములేకుండ అల్లాయని, ఖుదాయని పిలుచుకొనవచ్చును.

# రాముడు ఎవరు?



ప్రశ్న: మీరు రాముని గురించి మాట్లాడునప్పుడు దశరథుని పుత్రుడైన రాముని గురించిగాక జగత్పరిపాలకుని గురించి చెప్పుచుందురు. కాని మీ రామధున్ "సీతారామ" అని "రాజారామ" అని పలుకుచూ చివరకు "సీతారామ్‌కు జై" అందురు. ఈ రాముడు దశరథుని పుత్రుడుగాక మరెవరు?

గాంధీజీ: రామధున్ చేయునపుడు "రాజారామ్" అని సీతారామ్ అని తప్పక అనబడును. రామునికంటె సారవంతమైనది ఆ నామము. హిందూ ధర్మము అమూల్యరత్నములతో కూడిన సీమారహిత మహా సముద్రము. లోనికి పోయినకొలది హెచ్చు సంపదలను కనుగొందువు. వేలకొలది ప్రజలు రాముని, కృష్ణుని నిస్సందేహముగా చారిత్రక పురుషులుగా చూతురు, దశరథుని పుత్రునిగా భగవంతుడు మానవ రూపముతో రాముడుగా అవతరించెనని, ఆయనను పూజించిన ముక్తిని పొందుదురని నమ్మెదురు. కృష్ణుని విషయమూ అంతే. చరిత్ర, కల్పన, సత్యము ఇట్లు కలగాపులగము చేయబడినది. వానిని వేరు పరచుట అసంభవము. భగవంతునికి ఆరోపించిన నామములు, రూపముల నన్నిటిని ఒకే నిర్వికారుడైన, సర్వాంతర్యామియైన రాముని ఉదహరించు చిహ్నములుగా నేను విశ్వసించితిని. అందువలన సీతాపతి, దశరథ పుత్రుడగు రాముడు నాకు ఎవని నామమును హృదయమందు లిఖించుకొనిన మానసిక, నైతిక, భౌతిక తాపములు నివారించునో, అట్టి సర్వ శక్తియుతుడు.

దశరథ పుత్రుడైన రాముడు చిరంజీవి ఎట్లగును అనునది ముఖ్య ప్రశ్న. ఈ ప్రశ్నను సంత తులసీదాసే ఉదహరించి, దానికి సమా

ధానము చెప్పెను, నిజమునకు సమాధానము కారణసహితముగ చెప్పలేము. బౌద్ధికముగా తృప్తిచెందుటకు అది సాయపడదు. అది హృదయము, హృదయముతో సంభాషించుకొనిన విధముగ నుండును. మొట్ట మొదట రాముని సీతాపతిగా పూజించితిని, కాని నా జ్ఞానము అనుభవము వృద్ధియైన కొలది నా రాముడు చిరంజీవి. సర్వాంతర్యామి అయ్యెను. దీని అర్థము రాముడు సీతయొక్క భర్తయగుటతో సీతాపతి యొక్క అర్థము విస్తరిల్లెను. ప్రపంచము ఇట్లే పరివర్తన చెందును. కేవలము దశరథుని పుత్రునిగా భావించువానికి రాముడు సర్వాంతర్యామి కాజాలడు. కాని రాముని దేవునిగా నమ్మువానికి సర్వాంతర్యామి. రాముని తండ్రి కూడ సర్వాంతర్యామి యగును—తండ్రి కుమారులు ఏకమగుదురు. ఇది అంతయు ఊహాయని అనవచ్చును. "ఎవరి నమ్మిక ననుసరించి వారికి" అని మాత్రము నేను చెప్పగలను. మూలమున అన్ని మతములు ఒకటే అయిన మతములన్నిటిని సహానుభూతితో చూడవలెను నేడు అవిభిన్నమైనవిగా చూడబడుచున్నవి. అందుచేతనే మనము ఒకరినొకరము చంపుకొనుచున్నాము. మతమనిన విసుగుకలిగిన మనము నిరీశ్వర వాదులము అగుదుము. అప్పుడు అల్పులము గాక మనకు భగవంతుడుకూడ ఉండడు. కాని మనము వాస్తవిక జ్ఞానము పొందితిమేని ఆ అల్పత్వము నశించి భగవంతుడు అంతయు తానే యగును. అప్పుడు రాముడు దశరథపుత్రుడు, సీతయొక్కపతి, భరత, లక్ష్మణుల సోదరుడు కాడు. ఆయన పుట్టుక లేనివాడు, శాశ్వతుడు అగును. రాముని దశరథుని పుత్రునిగా నమ్మని వారు నాకు గౌరవపాత్రులే. అయినను వారు సామూహిక ప్రార్థనలలో పాల్గొనవచ్చును. రాముని గురించిన ఈ విషయము తర్కాతీతమైనది. నేను నమ్మినదానిలో ఉపయుక్తమైనదానిని చదువరికి ఇచ్చుటకు ప్రయత్నించితిని.

---

# నా రాముడెవరు?

సర్వశక్తియుతుడైన భగవానుని సేవను మీరు అంగీకరించుడు మీరు ఆయనను ఏ పేరుతో పిలుచుచున్నారను ప్రశ్నలేదు. అపుడు మీరు ఏ మానవుని యొక్కయు, మానవుడు కాని వాని యొక్కయు ముందు మోకరించరు. నేను రాముని, కేవలము ఒక వ్యక్తిగా భగవంతునితో కలుపుచుంటిననుకొనుట అమాయకత్వము, నా రాముడు స్వయముగా భగవానుడే అను విషయమును నేను అనేక పర్యాయములు స్పష్టపరచి యున్నాను. ఆయనలోగడ ఉండెను. నేటికికూడా ఉన్నాడు. ముమ్ముందు కూడా శాశ్వతంగా ఉండును. ఆతడు ఎన్నడునూ జన్మించలేదు. ఆయన నెవ్వరు సృష్టించలేదు. అందువలన మీరు వేరువేరు ధర్మములను సహించవలెను. వాటిని గౌరవించవలెను, నేను స్వయంగా విగ్రహముల నమ్మను. కాని ఇతరులను గౌరవించినట్లే మూర్తి పూజచేయు వారినికూడ గౌరవింతును. విగ్రహములను పూజించువారు కూడ ప్రతిచోటను వ్రేలినుండి కత్తిరించి పారవైచిన గోటి యందు కూడ ఒకే భగవానుని పూజించుచున్నారు. నాకు రహీం, రహమాన్, కరీమ్ అనిపేరుగల మహమ్మదీయ మిత్రులుకలరు. నేను వారిని రహీం అని, రహమాన్ అని పిలచినప్పుడు నేను వారిని అల్లాఅను కొందునా ?



# భగవంతుడు ఎవరు, అతడెచట కలడు

బ్రహ్మాచర్యమన నేమి అను విషయమును గురించి నేను వ్రాయుచూ బ్రహ్మచర్యమంటిని. కాని అది తెలిసిన మాత్రమున భగవంతుని రూప వివరణ గోచరించదు. దాని సరియైన వివరణ తెలిసిన భగవంతునివైపు అధిగమించుటకు సరియైన మార్గముకూడ తెలుసు కొనగలము, భగవంతుడు మానవుడుకాడు. అందువలన అతడు ఒక మనుష్యుని యందు ప్రవేశించెను. అవతారము దాల్చెను అని చెప్పిన అది పూర్ణ సత్యముకాదు, ఒక విధముగా భగవంతుడు ఒక ప్రత్యేక వ్యక్తియందు ప్రవేశించును అని అనుటకు అర్ధము ఆవ్యక్తి భగవంతునికి హెచ్చు సమీపమందుండెను అని మాత్రమే. అతనియందు మనకుఅధిక భగవత్తత్వము కినుపించును. భగవంతుడు అన్ని స్థలములందు ఉన్నాడు. అతడు అందరియందు కలడు. అందువలన మనమందరము భగవంతుని అవతారమూర్తులము. కాని అట్లు చెప్పినందువలన ఎట్టి సమస్యా పరిష్కారముకాదు. రాముడు కృష్ణుడు మొదలగువారిని మనము అవతారములందుము. ఏలయన వారియందు మానవులు భగవంతుని గుణములను చూచి యుండిరి. తుదకు రాముడు, కృష్ణుడు మొదలగు వారి స్మరణ ప్రపంచమందున్నది. వారి స్మృతిగా చిత్రములుకూడ కలవు. చరిత్రయందు అట్టివారు ఉండి యుండిరో లేదో గాని వారికిని ఈకల్పితమైన చిత్రములకు ఎట్టిసంబంధములేదు. అనేకమార్లు మనము చరిత్రయందలి రాముని, కృష్ణుని వెతకి కష్టములలో చిక్కుకొని పోదుము. మనము అనేక విధములైన ఉపాయముల సాయము తీసికొనవలసి వచ్చును.

నిజమేమన భగవంతుడు ఒకశక్తి, తత్వము. శుద్ధ చైతన్యము. అతడు అన్ని ప్రదేశములందు ఉన్నాడు. కాని కలతను కలిగించు విషయ మేమన అట్లు ఉండియు ఎల్లరకు ఆయనవలన సాయము, లాభము దొరుకుటలేదు. అందరు ఆయన సాయమును పొందజాలకున్నారని చెప్పవచ్చును.

విద్యుత్తు ఒక పెద్దశక్తి కాని అందరూ దాని లాభమును పొంద జాలరు. దానిని ఉత్పత్తి చేయుటకు స్థిరమైన సూత్రముకలదు. దాని ప్రకారము చేసినగాని విద్యుచ్ఛక్తిని తయారుచేయలేము. విద్యుచ్ఛక్తి జడపదార్థము, అజ్ఞానవస్తువు. దానిని ఉపయోగించుపద్ధతి చైతన్య మానవుడు శ్రమించి తెలుసుకొనగలడు. మనము భగవంతుడు అని పిలచు చైతన్యయుతమైన గొప్పశక్తిని ఉపయోగించుకొనుటకు కూడ నియమము కలదు. కాని ఆ నియమమును వెదకుటకొరకు చాల హెచ్చు శక్తి అవసరమను విషయము స్పష్టము. ఆ నియమము యొక్క పేరు ఒక శబ్దములో బ్రహ్మచర్యము. బ్రహ్మచర్యమును పాలించుటకు సూటిమార్గము రామనామము. దీనిని నేను అనుభవము వలన చెప్పగలను. తులసీదాసు వంటి భక్తులు, ఋషులు మునులు ఆ మార్గమునే చెప్పియుండిరి. నా అనుభవమునుండి అవసరమునకు మించిన అర్థమును తీయవలదు. రామనామము ఎల్లెడలకల రామబాణ ఔషధము. ఇది నేను మొట్టమొదటిసారిగా ఉర్లీకాంచనమునందే స్పష్ట ముగా తెలుసుకొంటిని. దాని పూర్తి ఉపయోగములు తెలుసుకొనిన వ్యక్తి ప్రపంచమున అతి అల్పముగా బయటిపని చేయవలసి వచ్చును. అయినప్పటికిని అతనిపని అతి గొప్పదగును.

ఇట్లు ఆలోచించుచూ నేను చెప్పునదేమన బ్రహ్మచర్య రక్షణను గురించి అంగీకరించిన నియమములు అటువంటివి. నిజమైన శాశ్వత

రక్షణ రామనామమే. రాముడు నాలుక నుండి దిగి హృదయమున ప్రవేశించినపుడే దాని పూర్తి చమత్కారము కనుపించును. ఈపవిత్ర సాధనను పొందుటకొరకు ఏకాదశవ్రతములు ఉండనే ఉన్నవి. కాని సాధన ఏదో సాధ్యమేదో భేదము తెలుసుకొనుట కష్టమనుపించు అనేక సాధనలు కలవు. ఏకాదశ వ్రతములలో సత్యమునే తీసుకొనినసత్యము సాధనము. రాముడు సాధ్యనూ అని గాని రాముడు సాధనము సత్యము సాధ్యమా అనిగాని అడుగవచ్చును.

కాని నేను సూటి విషయమునకు వత్తును బ్రహ్మచర్యమును గురించి నేడు అంగీకరించిన అర్థము జననేంద్రియముపై నియంత్రణను సంపాదించుట. ఆ సంయమమునకు సువర్ణ మార్గము, దాని శాశ్వత రక్షణ రామనామమే యగును.

—o—

# దశరథ పుత్రుడైన రాముడు

ఒక ఆర్య సమాజ సోదరుడు ఇట్లు వ్రాసెను:

"మీరు ఈశ్వర స్వరూపునిగా తలచు నాశరహితుడగు రాముడు దశరథ పుత్రుడైన రాముడెట్లు కాగలడు? ఈ సందేహామువలన. నేను మీ ప్రార్థన్న కూర్చొనూ రామనామము చేయుటనందు పాల్గొనుట లేదు, ఇది నాకు కష్టముగా నున్నది, ఏలయనగా అందరూ భాగ స్వాములు కావలెనని మీరనుచుందురు, అది సబబుకూడ. అందరూ పాల్గొనుటకు మీరేమియు చేయలేరా?"

"ఆ విషయమంతమూ నేను చెప్పియే యున్నాను.

ఎవరు హృదయపూర్వకముగా పాల్గొందురో, ఒకే స్వరముతో ఎవరు పాడగలరో వారే ఇందు పాల్గొందురుగాక. మిగిలిన వారు శాంతిగా ఉండుడు. కాని ఇది స్వల్ప విషయమైనది. విశేషమేమన దశరథ సుతుడైన రాముడు అవినాశి ఎట్లు కాగలడు అని. ఈ ప్రశ్న తులసీదాసే స్వయంగా ప్రస్తావించి దానికి సమాధానముకూడా చెప్పి యుండెను. అట్టి ప్రశ్నలకు జవాబు బుద్ధితో ఇవ్వజాలము. దానివలన స్వయముగా బుద్ధికికూడా సంతోషముగా ఉండదు. అది హృదయగత విషయము. హృదయపు మాట హృదయమునకే ఎరుక. మొదట నేను రాముని సీతాపతి రూపముతో పూజించితిని. కాని నా జ్ఞానము అనుభవము పెరిగినకొలది నా రాముడు అవినాశిసర్వవ్యాపి అగుచూపోయెను. అవును కూడా. దీని అర్థమేమన అతడు సీతాపతిగానే ఉండెను దానికి తోడు సీతాపతియొక్క భావముకూడ విస్తరించినది. ప్రపంచము అట్లే నడచుచుండును. ఎవని రాముడు దశరధుని వాడో అతని రాముడు సర్వవ్యాపి కాజాలడు. కాని సర్వవ్యాపియైన రాముని తండ్రి దశరధుడు కూడా సర్వవ్యాపి యగును—తండ్రి కుమారుడు ఒకటియై పోవుదురు. ఇది అంతయూ మన ఇష్టము వచ్చినట్లు చేయుట అని అనవచ్చును. యద్భావం తద్భవతి." మరొకఉపాయము కానుపించదు. మూలమునందు సర్వధర్మములు ఒకటేయైన మనము అన్నిటిని ఏకీకరణ చేయవలెను, అవి వేరుగనే యున్నవి. వేరుగనే భావించి మనము ఒకరినొకరము కొట్టుకొందుము. అలసిపోయినప్పుడు నాస్తికులమగుదుము. ఇంక "మేము" లేక భగవంతుడు లేడు, మరొకడు లేడు. కాని తెలుసుకొనినపుడు "మేము" మిగులదు. సర్వస్వమూ భగవంతుడే యగును. అతడు దశరథ నందనుడు. సీతాపతి, భరత లక్ష్మణుల

సోదరుడు అగును కొనూ కాడు, దశరథపుత్రుడయిన రాముని అంగీకరించ పోయినను అందరితోకలసి ప్రార్థనతో కూర్చొనువారు త్యాగమే చేయుచున్నారు. ఇది బుద్ధివాదము కాదు. నేను ఏమిచేయుదునో, ఏది నమ్ముదునో దానిని ఇచట చెప్పుచున్నాను.

---

# ఏకైక సహకారి

( గాంధీజీ ఒక వ్యక్తి యొక్క పేరుగా రామనామమును భావించి యుండలేదు, రాముడు ఆయనకు భగవంతుని పర్యాయము. ఆయన జపించినపుడు ఇతరులకు ఉపదేశించినపుడు గాంధీజీ రాముని నామరూప రహితుడగు పరమాత్మగా భావించియుండెను. ఆ భావమును వివరించుచూ గాంధీజీ ఇట్లు చెప్పెను: )

"నాకు రాముడు, అల్లా, భగవంతుడు పర్యాయ పదములు. అమాయిక ప్రజలు నేను వారి కష్ట సమయమున ప్రత్యక్షమైతినని భ్రమపడుచున్నట్లు కనుగొంటిని: వారి మూఢ విశ్వాసమును తొలగించవలెనని నేను తలచుచున్నాను. నేనుఎవ్వరకు ప్రత్యక్షముకాలేదు. ఒక అల్పప్రాణిపై ఆధారపడి యుండుట వారిసంపూర్ణ భ్రమమాత్రమే. అందుచేత బాగుగా ఋజువైన, నిరాడంబరమైన, ఎన్నడు విఫలము కాని సమాధానమును అనగా వారి కోరికల పూర్తికొరకు ప్రతి ఉదయము సూర్యోదయమునకు పూర్వము, ప్రతి సాయంత్రము నిదురించుటకు పూర్వము భగవంతుని సహాయమును ప్రేరేపించు విధానమును

వారికిచ్చితిని. లక్షలకొలది హిందువులకు ఆయన రాముడను పేరుతో తెలియును. బిడ్డగా భయముచేత ఆవరింపబడిన సమయమున రాముని ఆహ్వానించుట నాకు నేర్పబడినది. ఆపత్సమయములో రామనామము పెద్ద అండగా ఉండిన అనేకమంది సహచరులను నేనెరుగుదును. నేను దానిని ( రామనామము ) ఘారాలజాతివారికి, అస్పృశ్యులకు చెప్పితిని. అతిగా చదువుటవలన విశ్వాసము కోలుపోయిన, దృష్టి వికలత చెందిన చదువరికి చెప్పుదును. విషయగ్రహణము మనల ననేక జీవిత మజిలీల గుండా తీసుకొనిపోవును. కాని అపాయ సమయమున, ప్రలోభము కలిగినప్పుడు అదిమనకు ఆశాభంగముచేయును. అప్పుడు విశ్వాసమే మనల రక్షించును. రామనామము అనేక రీతుల భగవంతుని ప్రలోభపరచువారికి, ఎల్లప్పుడు తమను రక్షింపవలెనని కోరు వారికి కాదు. అది భగవంతునికి భయపడుచూ జీవించువారికి, తమనుతాము నిగ్రహ పరచుకొను వారికి మాత్రమే అయియున్నది.

—o—

# ఆపద్బాంధవుడు



“భారత దేశమందలి విద్యార్థులతో ఉత్తర ప్రత్యుత్తరముల వలన, వారు బండ్లకొలది పుస్తకములు చదివి వాటి విషయములను తమ మెదడునిండ నింపుకొని ఎంత ధ్వంసమైరో నాకు తెలియును. కొందరు స్థిమితము లేనివారుగను, ఇతరులు మతిచెడిన వారుగను, మరి కొందరు నిస్సహాయకరమైన అపవిత్ర జీవితమును గడుపుచున్నారు. వారు తామెంత ప్రయత్నించినను ఆ పిశాచమును లోబరచు కొనలే

కున్నామని చెప్పుచున్నప్పుడు నా హృదయము వారికొరకై పరుగిడును, "ఈ పిశాచపు బారినుండి తప్పించుకొనుట ఎట్లు. తమను ఆవరించిన అపవిత్రతనుండి బయట పడుట ఎట్లో చెప్పుడు" అనిదీనముగా అడుగుదురు. రామనామమును గ్రహించి మోకరిల్లి భగవానుని శరణు వేడుమని నేను వారిని కోరినవారు నావద్దకు వచ్చి, "భగవంతుడెక్కడున్నాడో మాకు తెలియదు. ఏమి ప్రార్థనచేయాలో మాకు తెలియదు" అందురు. వారు ఈ స్థితికి తేబడిరి.

నాకు ఒక తమిళ సామెత ఎల్లప్పుడు జ్ఞప్తికి వచ్చుచుండును. దాని అర్థము: "భగవంతుడు నిస్సహాయులకు సహాయకుడు" ఆయనను సహాయము కోరిన, ఎట్టి అరమరలు లేక ఆయనను సమీపించిన, ఎట్టి మినహాయింపులు. సందేహములు లేనియెడల నీవంటి పతితునికి ఆయన సాయపడగలడు. ఆయనను శరణు వేడిన లక్షలాది మానవులకుసాయము చేసినవాడు నిన్ను నిస్సహాయునిగా వదలునా ? ఏమయిన ఆయనభేదభావము చేయడు. మీలో ప్రతివారి ప్రార్థనకయినను జవాబువచ్చును. నా స్వానుభవమును పురస్కరించుకొని ఇట్లు చెప్పుచున్నాను. ఆ పాపవిమోచనా మార్గము ద్వారా నేను పయనించినాను. స్వర్గ రాజ్యము కొరకు మొదట ప్రయత్నింపుము. ఇంక అన్నియు నీకుసమకూడును.

కాని ప్రార్థన యనిన శబ్దముల యొక్క లేక చెవుల యొక్క వ్యాయామ క్రీడకాదు. నిరర్థక పదజాలమును కేవలము ఉచ్చరించుట కాదు. హృదయములను కదలింపజాలని ఎంత రామనామ ఉచ్చారణయైనను నిరర్థకము. ప్రార్థనయందు హృదయములేని శబ్దములకంటె శబ్దములు లేని హృదయము ఉత్తమము అది ఆధ్యాత్మిక ఆవేదనకు

స్పష్ట సమాధానముగ నుండవలెను. ఆకలిగొన్న వాడు తృప్తికర ఆహారమును అనుభవించినట్లే ఆకలిగొన్న ఆత్మ హృదయ పూర్వక ప్రార్థనను అనుభవించును.

ప్రార్థనయొక్క మహత్తును అనుభవించినవాడు ఆహారము లేకుండ ఉండగలడుగాని ప్రార్థనలేకుండ ఒక్క క్షణమైననూ విలువ లేదని నా యొక్కయు, నా సహచరులయొక్కయు కొంత అనుభవ మును చెప్పుచున్నాను. కారణమేమన ప్రార్థనలేక ఆంతరంగిక శాంతి లేదు.

***

# నిస్సందేహమైన సహకారి

—o—

రామనామము నిస్సందేహమైన సహకారి. హృదయపూర్వక ముగా ఉచ్చరించిన ప్రతి దుర్భావననూ అది పారద్రోలును. చెడు భావనలు తొలగిపోయిన దాని కనుగుణమైన కార్యములు సంభవము కావు. మనస్సు బలహీనమైన బాహ్య సహకారులు నిష్ప్రయోజనము. మనస్సు పవిత్రముగా ఉండిన అవి అనవసరము. దీని అర్థము పవిత్ర భావనలు కలవాడు అన్ని స్వేచ్ఛలు తీసుకొనుచూ సురక్షితముగా ఉండగలడని కాదు. అట్టి వ్యక్తి తనకుతాను ఎట్టిస్వేచ్ఛలను తీసుకొనడు అతని సంపూర్ణ జీవితము అతని ఆంతరంగిక పవిత్రతకు తప్పనిసాక్షే. మనస్సు మానవుని నిర్మించును వినాశమూ చేయును. అని గీత వాస్తవి కతను చెప్పుచున్నది. మిల్టను ఈ భావమునే ఇట్లు చెప్పెను. మనస్సు

దాని చోటున అదే ఉన్నది. అది స్వర్గమును నరకముగను, నరకమును స్వర్గముగను చేయగలదు.

నా భావనలోని రామనామమునకు పిందులకు ఎట్టి సంబంధము లేదు. రామనామమును హృదయపూర్వకముగ ఉచ్చరించమనుటకు అర్థము ఒక అద్వితీయ శక్తినుండి సాయము పొందుట అని. దానితో పోల్చిన అణుబాంబు లెక్కకురాదు. ఈశక్తి అన్ని బాధలను తొలగించ గలదు. రామనామము హృదయమునుండి రావలెనని చెప్పుట సులభమే కాని వాస్తవికతను పొందుట చాలా కష్టము. ఏమైనను అది మానవుడు పొందదగిన అతి ఘనమైన విషయము.

***

# విశ్వాసము యొక్క చమత్కారము

—o—

"ప్రార్థన ఎడల విశ్వాసముగలవారికి నిరాశయనునదియే ఉండ రాదు. ఏలయనగా కాలము సర్వశక్తియుతుడయిన భగవంతుని చేతిలో నున్నది. తగిన సమయములో అతడు అన్నియు చేయును అందువలన భక్తుడు ఎల్లప్పుడు భక్తి, ధైర్యములతో ఏ పనియైనను చేయుటకు దారి చూచుచుండును."

గజేంద్రుని కథపై వ్యాఖ్యానించుచూ గాంధీజీ ఇట్లు అనెను, ఈ కథ యొక్క సారమేమనగా పరీక్షా సమయమున భగవంతుడు ఎల్లప్పుడు తన భక్తునికి సాయపడును. పరతు ఏమన ఆయనపై మనుష్యునికి సంపూర్ణ విశ్వాసముండవలెను ఆయన సాయమే మను

ష్యుడు పొందవలెను. విశ్వాసమునకు గురుతు తన కర్తవ్యమును చేసి పరిణామము మంచిగాని, చెడుగాని మనుష్యుడు దానిని అంగీకరించవలెను. సుఖము వచ్చిననూ దుఃఖము వచ్చిననూ అతనికి రెండునూ సమానముగా నుండవలెను. జనక మహారాజు విషయము ఇట్లు చెప్పుదురు: ఒకమారు ఎవరోవచ్చి మహారాజా! మీ రాజధాని మిధిల దహనమై పోవుచున్నది. అని చెప్పిరి. 'మిధిలాయాం ప్రదగ్ధాయాం న మే దహ్యాతి కశ్చన" మిధిలకు నిప్పు అంటుకొనిన నాకేమి? అని ఆయన సమాధానము చెప్పెను. అయన ధైర్య పూరితమైన శాంతికి రహస్యమేమన ఆయన ఎల్లప్పుడు మెలుకువతోనుండి తన కర్తవ్యమును నెరవేర్చుచుండెడివాడు. అందువలన మిగిలిన దంతయు ఆయన భగవంతునికి వదలగలవాడు.

"మొదట భగవానుడు తనభక్తుని కష్టమునుండి రక్షించును కష్టము వచ్చిపడిన భక్తుడు శాంతితో భగవంతుని ఇచ్ఛకు తలయొగ్గి సంతోషముతో దానిని సహించును. అని మీరు తెలుసుకొనుడు.



# జీవితమునకు అమోఘమైన అండ

—o—

[గాంధీజీ బ్రహ్మచర్యమును జీవితమునకు సర్వోత్కృష్ట సాధనగా భావించెను. బ్రహ్మచర్యమనగా కేవల జననేంద్రియ నిగ్రహముగా గాంధీజీ భావించియుండలేదు. జిహ్వాపై నియంత్రణ జననేంద్రియ నిగ్రహముకంటె హెచ్చు కష్టమైనదిగాను

బ్రహ్మచర్య సాధనకు అనివార్య విషయముగాను గాంధీజీ భావించియుండెను. కాని సంపూర్ణ బ్రహ్మచర్య సాధనకు శక్తి యుత సహకారి భగవన్నామ జపమని తన స్వానుభవముగా గాంధీజీ ఇట్లు చెప్పెను.]

"జననేంద్రియ నిగ్రహమునకు బలమైన సహకారి రామనామము లేక అట్టి మరొక మంత్రము ద్వాదశ మంత్రము (ఓం నమో భగవతే వాసుదేవాయ) కూడా ఉపయోగకారియగును. ఎవరికి ఇచ్చవచ్చిన మంత్రము వారు జపించవచ్చును. నాకు చిన్నతనము నుండియూ పరిచయముండుట వలనను, నా పోరాటములలో నాకు ఎల్లవేళల అండగా ఉండియుండుటవలనను నేను రామనామమును సూచించితిని. ఏమంత్రమును ఎంచుకొనిన దానియందు వ్యక్తి పూర్తిగా తన్మయుడై పోవలెను. జపముచేయు సమయమున ఇతర ఆలోచనలు అంతరాయము కలుగజేసిన లెక్కచేయరాదు. విశ్వాసముతో జపముచేయుచూ పోవు చుండిన తుదకు జయము లభించును. ఆ మంత్రము జీవితమునకు చేయూత అయి ప్రతి సంఘర్షణ నుండియు బయట పడవేయును. ప్రార్థన అన్నిటికి అంతిమ శరణ్యము. హృదయపూర్వకముగా నిత్యము రామనామమును జపించుచూ భగవానుని కృపకై వేచియుండవలెను. రాముని సాయముతో దశకంఠరావణు డను మన ఉద్రేకములను అధిగ మించవలెను. రామునియందు విశ్వాసముంచి ఆయన కృపకు మనను మనము సర్వార్పణ చేసుకొనిన విజయము మనకు తథ్యము. ఆత్మ విశ్వాసము కోలుపోరాదనుట అన్నిటికి మించినది. జిహ్వేంద్రియ లోలతను నివారించుకొనుట అవసరము.

ఉద్రేకములు నిన్ను అంగమించుటకు భయపెట్టుచుండిన మోకరించి భగవానుని సాయమునకై విలపించుము. రామనామము నాకు అమోఘమైన సహకారి యైనది,

పవిత్ర మంత్రములనుండి మనము ప్రాపంచిక లాభముల నపేక్షింపరాదు. ఈ మంత్రముల ముఖ్య ప్రభావము వ్యక్తిగత పవిత్రతను కాపాడునదిగా నుండును. ప్రతి జాగరూకతగల సాధకుడు దీని అనుభవమును వెంటనే పొందగలడు. ఆ మంత్రమును చిలుకపలుకులవలె ఉచ్చరించుచుండరాదని జ్ఞప్తియందుంచుకొనవలెను. తన ఆత్మను దానియందు విలీనము చేయవలెను. చిలుక అట్టి మంత్రములను అర్థరహితముగా ఉచ్చరించును. కాని మనము వానిని బుద్ధి పూర్వకముగా మనయందలి అయోగ్య భావములను పారద్రోలుటకై సంపూర్ణ విశ్వాసముతో మనకు సహకారిగా నుండుటకు ఉచ్చరించవలెను."



# రామనామ ఉచ్చారణ అవసరం

ప్రశ్న: "ఇతరులతో సంభాషించునప్పుడు, బుద్ధితో కఠినమైనపని చేయునపుడు లేక హఠాత్తుగా సంభవముగు గాబరా మొదలైన సమయములోనూ హృదయములో రామనామ జపము సంభవమా? అట్టి సమయములో కూడ చేయుచుండిన ఎట్లు చేయుచున్నారు?"

సమాధానము: "మనిషి ఏ స్థితియందున్ననూ, నిద్రపోవుచున్నను, అతనికి అన్యాయమయిన ఎడల, రామనామము హృదయస్థమయిన, గుండె కొట్టుకొనుచున్నంతవరకు హృదయములో రామనామము జరుగుచునేయుండునని అనుభవము చెప్పుచున్నది. లేని ఎడల రామనామము చేయుచున్న అది వాని కంఠమునుండి మాత్రమే వెలువడుచుండవచ్చును. లేదా హృదయమును స్పర్శించియు ఉండవచ్చు

కాని హృదయముపై దాని సామ్రాజ్యము స్థాపింపబడియుండ లేదు. రామనామము హృదయముపై అధికారమును పొందినపుడు ఎట్లు జపముచేయును అను ప్రశ్నయే అడుగజాలము. ఈ విధముగా రామ నామము ఎవరి హృదయము నందయినా స్థిరపడినదా అనిన అట్టివారు చాల తక్కువగానున్నారు. రామనామమందు ఏ శక్తి కలదందురో ఆవిషయములో నాకెట్టి సందేహములేదు. ప్రతివ్యక్తి తాను కోరు కొనినంత మాత్రమున రామనామమును తన హృదయమున అంకితము చేసుకొనలేడు. దానికొరకు అలసటలేని పరిశ్రమ, ధైర్యము, అవుస రము. పారసమణిని పొందుటకు ధైర్యము పరిశ్రమ ఎందులకుండదు. రామనామము అంతకంటె హెచ్చు విలువగలది. అమూల్యమైనది.

ప్రశ్న: రామనామమును హృదయమందుంచుకొనిన చాలదా? దానిని రామబాణ ఔషధమని చెప్పవచ్చును. అందులకు మొదటి పరతు ఉచ్చరించుటలో ఏదయిన విశేషమున్నదా?

జవాబు: రామనామము ఉచ్చరించుటలో విశేష మహత్తుకలదని నా విశ్వాసము. భగవంతుడు తన హృదయమున స్థిరముగా ఉన్నాడని ఎవరయినా గ్రహించిన అతడు నోటితో రామనామమును జపము చేయ నగత్యములేదు, కాని నేను అట్టి వ్యక్తి నెవ్వరనూ ఎరుగను. పైగా నోటితో రామనామము జపించుటలో కొంతవిశేషము కలదని నా అను భవము. అది ఎట్లో లేక ఏ విధముగనో తెలుసుకొన నగత్యములేదు.

—o—

# రామనామమును ఎట్లు జపించవలెను

మానవుని పీడించు త్రివిధ రోగములకు రామనామమే రామనా మము హృదయాంతర్గతము నుండి వెలువడవలెను అట్లనిన దాని అర్థ

మేమి? మానవులు తమ శారీరక రోగముల నివారణోపాయముల వెదకుటకు ప్రపంచములో చిట్ట చివరకు పోవుటకుకూడా అలసిపోరు. కాని మానసిక, ఆత్మసంబంధ రుగ్మతలకు ముందు శారీరక రుగ్మతలు అతి అల్ప మహత్తు కలిగియుండును. మానవుని భౌతిక శరీరము చివరకు ఒక రోజున నశించిపోవునదే. అది శాశ్వతముగా ఉండలేక పోవుట దాని సహజ లక్షణమే. అట్లయ్యును మానవులు తమలోని ఆత్మను మరచి శరీరమునే ప్రేమ, మక్కువతో చూచుచున్నారు. రామనామముపై భక్తిగల వ్యక్తి తన శరీరముపై లేనిపోని మక్కువను పెంచుకొనక దానినిభగవత్సేవచేయు ఒక సాధనముగనే భావించును. అతనికి ఇట్టి మనః ప్రకృతి నవలంభించుటకు రామనామమునుమించి మరొక వస్తువులేదు.

రామనామము హృదయమున నిలుపు కొనుటకు అమిత ధైర్యము కావలెను. అందులకు యుగములు పట్టవచ్చును. కాని ఆ ప్రయత్నముచేయవలసినట్టిది. అంతసాఫల్యముకూడా భగవంతుని కృప వలననే పొందగలము.

వ్యక్తి తనఅంతర్బాహ్యసత్యత, విశ్వాసము, పవిత్రతయొక్క గుణములను పెంపొందించు కొన సంతవరకు రామనామము అతని హృదయమునుండి వెలువడదు మనము ప్రతిదినము సాయంకాల ప్రార్థనలో స్థితప్రజ్ఞుని వర్ణనను గురించిన శ్లోకములను చదువుచుంటిమి. మనము ఇంద్రియములను స్వాధీనమందుంచుకొనిన ఎడలను. జీవితము సేవామయము చేయుటకొరకే. తినుట, త్రాగుట, ఆహ్లాదానుభవము, ఆనంద వినోదములు చేయుచుండిన ఎడల మనలో ప్రతిఒకడు స్థిత ప్రజ్ఞుడు కాగలడు. అనగా నీఆలోచనలపై నీకు నియంత్రణ లేనపుడు, నీవు ఒక చీకటికొట్టులో దాని కిటికీలు, ద్వారములు మూసివేసి అందు

నిద్రించుటకెట్టి అభ్యంతరము లేనియెడల, చెడుగాలి పీల్చుచుండిన, మురికి నీరు త్రాగుచుండిన నీవు రామనామము జపించుట నిరర్థకము.

కాని దీని అర్థము ఎంత పరిశుద్ధముగా నీవుఉండవలెనో అంత పరిశుద్ధముగా లేవు గనుక నీవు రామనామమును జపించుట మానవలె ననిగాదు. రామనామమును హృదయపూర్వకముగా గ్రహించువాడు సులభముగా తననుతాను నిగ్రహించుకొనగలడు, నియంత్రణలో నుండ గలడు. అతనికి ఆరోగ్యముగానుండి ఆరోగ్య నియమముల పాలించుట సులభమగును, అతని జీవితము సహజముగా గడచిపోవును, అతని యందు ఎట్టి విషమత ఉండదు. అతడు ఎవరిని బాధించుటకుగాని దుఃఖితుని చేయుటకుగాని ఇష్టపడడు. ఇతరుల దుఃఖముల తీర్చుట కొరకు, వారికి సహాయపడుటకు తాను కష్టము అనుభవించుట అతనికి అభ్యాసమగును. అతనికి శాశ్వతముగా తిరుగులేని సుఖలాభము ప్రాప్త మగును. అతని మనస్సు ఒక శాశ్వతమైన లోపించని సుఖముచే నిండి పోవును. అందువలన మీరు ఈ ప్రయత్నములో నుండుడు. పనిచేయు చున్నంతసేపు ఎల్లవేళలలో లోన రామనామమును జపించుచుండుడు. ఇట్లు చేయుచుండిన రామనామము మీకు నిద్రించువేళ, మేల్కొని యున్నవేళ మిత్రుడయి మెలగుదినము వచ్చును. అప్పుడు భగవత్కృప వలన నీవు శారీరక, మానసిక, ఆధ్యాత్మికపూర్ణ ఆరోగ్యవంతుడవై యుందువు.



# రామనామ సంకీర్తనము

అనుభవము కొలదిగానయిననూ కలవారికి హృదయపూర్వకముగా రామనామము అనగా భగవన్నామము జపించుట యందలి శక్తి తెలియును. లక్షల కొలది సైనికులు తమ బ్యాండు యొక్క అడుగు

అనుకూలముగా పాదములను వేయుచూ ముందుకు నడచుచూ పోవు నపుడు కలుగు శక్తిని నేనెరుగుదును. సైనిక శక్తి ప్రపంచమున కలిగించిన వినాశమును వీధిన పోవుచుండువాడు సహితము గమనించ గలడు. యుద్ధము సమాప్తమైన తరువాత వచ్చు పరిణామము యుద్ధమునకంటె హెచ్చుచెడును కలిగించుననని సాధారణముగా చెప్పు కొందురు. సైనికశక్తియొక్క దివాలా తనమునకు ఉదాహరణ ఇదియే.

లక్షలకొలది ప్రజలద్వారా ఏకతాళము. ఒకేలయతో చేయబడు రామనామ సంకీర్తనయొక్క శక్తి సైనిక శక్తియొక్క దృశ్యమున కంటె పూర్తిగా భిన్నమైన, అనేకరెట్లు హెచ్చుశక్తి కలిగియుండునని ఎట్టి సంకోచములేక చెప్పగలను. హృదయ పూర్వకముగా భగవన్నామము జపించినఎడల నేటి వినాశముయొక్క స్థానమునందు స్థిరమైన శాంతి ఆనందము జన్మించగలదు.



# నామ జప మహాత్మ్యము

"ఒకే దానిని తిరిగి తిరిగి ఉచ్చరించుట నాకువిసుగుపుట్టించును, అది నా వివేచనా సహితశాస్త్ర స్వభావమునకు లోపమే కావచ్చును. కాని ఏలనో ఈ మరల మరల ఉచ్చరించుట నాకు సమ్మతముకాదు. "తండ్రీ, వారిని క్షమించుము, వారు చేయునదేమో వారికే తెలియదు" అనునది మరల మరల ఉచ్చరించినపుడు బోక్‌గారి మధుర గానము కూడ నన్ను ప్రభావితుని చేయుటలో విఫలమగును."

"కాని గణితమునందునూ దశాంశ భిన్నములు మరల మరల వచ్చుచుండునుగదా" అని గాంధీజీ చిరునవ్వుతో అనెను.

"కాని ప్రతిసారి ఒకక్రొత్త విషయమును వచ్చును." అని ఆ గణితశాస్త్రజ్ఞుడనెను.

అట్లే ప్రతి ఉచ్చారణ లేక జపమునకు క్రొత్త అర్థముఉండును. ప్రతి ఉచ్చారణ నిన్ను భగవంతునికి సామీప్యమునకు చేర్చును. ఇది స్పష్టమైన సత్యము. మీరు ఇచట ఒక అవ్యావహారకుడైన వానితోగాక తన జీవితములో ప్రతి నిమిషము అనుభవించునదే చెప్పువానితోను, ప్రాణము ఆగిపోవుట సులువుగాని ఈ సతత క్రియ (జపము) ఆగిపోని వానితో మాట్లాడుచున్నారని చెప్పుచున్నాను. అది స్పష్టముగా ఆత్మకు కావలసినది" అని గాంధీజీ అనెను.

"అది నేను సమ్మతింతును. కాని అత్యుత్తమ వస్తువును కూడ దురుపయోగము చేయవచ్చును. ఎంత భేషజమున కయిన అవకాశము కలదు. కాని భేషజముకూడ సద్గుణగానమే కదా. పదివేల భేషజ పరులకు కోట్లనుంది అందే శరణ్యమును పొందు వారిని నీవు చూడగలవు. అది భవనమునకు పనిచేయు వారికొరకు ఏర్పరచు పరవంజా వంటిది.

"కాని ఈ ఉపమానమును కొంత ముందునకు పొడిగించినభవన నిర్మాణము పూర్తియైన తరువాత పరవంజాను తొలగించవలెననిమీరు సమ్మతింతురుగదా?" అని పిర్రి సెరిసోలు గారనెను.

"నిజమే, ఈ శరీరమును తొలగించినప్పుడు అదికూడ తొలగింపబడును."

"ఎందుచేత ?"

ఈ సంభాషణను శ్రద్ధగా వినుచున్న విల్ కిన్ సన్." ఏలననగా మనము శాశ్వతముగాభవననిర్మాణముచేయుచున్నాముగనుక" అనెను.

"ఏలననగా మనముశాశ్వతముగా పవిత్రతకొరకు ప్రయత్నించుచున్నాముగాన. భగవంతుడే నిష్కళంకుడు మానవుడు కళంక రహితుడు కాజాలడు" అని గాంధీజీ అనెను:

—o—

# రామనామము గారడీ వంటిదికాదు

"రామనామము కేవలము కొలది వ్యక్తులకొరకు మాత్రమే కాదు. అది అందరికొరకు అయియున్నది. రామనామము నుచ్చరించువాడు తనకొరకు ఒక పెద్ద ఖజానాప్రోగుచేసుకొనుచూ పోవుచుండును. అది ఎప్పటికిని తరుగని ఖజానా. దానిలోనుండి ఎంతతీసిన అంత పెరుగుచూ పోవుచుండును. దానికి అంతమేలేదు. ఉపనిషత్తు 'పూర్ణము నుండి పూర్ణమును తీసివేసిన పూర్ణమే మిగిలియుండును' అని చెప్పినట్లు రామనామము సర్వరోగములకు అవి శరీర సంబంధమైనవిగాని, మానసికమైనవిగాని ఆధ్యాత్మిక సంబంధమైనవి కాని శక్తి వంతమైన ఔషధము.

కాని పరతు ఏమనరామనామము హృదయమునుండి వెలువడవలెను. నీమనస్సునకు చెడు ఆలోచనలు వచ్చుచున్నవా? కామముగాని లోభముగాని నిన్ను పీడించుచున్నదా? అట్లయిన రామనామము గారడీ వంటిదికాదు. మీ మనస్సులో శ్రమలేకుండా మోసప్రవృత్తితో మీరు లక్షలరూపాయలు సంపాదించవలెనను పేరాశ కలిగిన దనుకొనుము. కాని మీకురామనామమునెడల శ్రద్ధయుండిన మీరు భార్యాబిడ్డలకొరకు బహుశః అంతరించిపోవు భాగ్యమును ఏలకూడబెట్టవలెను? వారికి సత్ ప్రవర్తన, మంచి విద్య, శిక్షణరూపములో వారు విజా

యుతీగాను, పరిశ్రమచేసి ఆహారము సంపాదించుకొనగలుగు పిత్రార్జిత మును నేను వారికి ఏల వదలిపోరాదు అని ఆలోచింతురు. మీరు అట్లు ఆలోచింతురేకాని చేయజాలరు. కాని రామనామజపము నిరంతరము చేయుచుండిన అది నోటినుండి హృదయమున ప్రవేశించి రామబాణ ఉపాయము సమకూర్చును. అది మీ భ్రమ లన్నిటిని నాశమొనర్చును. మీ అసత్యమోహములకు, అసత్యములకు విముక్తినికూర్చును. అపుడు మీరో పిల్లలకు కోట్లు సమకూర్చవలెనను భావముతో ఎంత పిచ్చివార మైతిమని, అందుకు మారుగా వారికి అమూల్యమైన, పెదమార్గము నకు లాగని, ముక్తిని ప్రసాదించు రామనామపు ఖజానా ఇచ్చిన బాగుండెడిదని తెలుసుకొందురు. హద్దులేని సంతోషమునను భవింతురు. అపుడు మీరు మీపిల్లలతోను, పత్నితోను." నేను కోట్లు సంపాదింపవలె నని పోతిని కాని ఆ సంపాదన మరచిపోతిని. మరొక విధమైన కోట్లు తెచ్చితిని" అని అందురు. అప్పుడువారు "ఆ రత్న మెక్కడ? చూడ నిమ్ము" అని అడుగుదురు. సమాధానముగా మీకళ్ళు నవ్వును. నోరు నవ్వును. మెల్లగా మీరు సమాధానముగా "కోట్లకు పతియైన వానిని హృదయమందుంచుకొని తెచ్చితిని. మీరు సుఖముగా నుండుడు నేనూ సుఖముగా నుందును" అని యందురు.

—o—

# సకల ప్రార్థనలసారము రామనామము

"మీరు మీమీఇండ్లలో ఉదయసాయంత్రములందు నియమముగా ప్రార్థన చేయుదురని ఆశించుచున్నాను. మీకు ఇష్టము లేకపోయిన సంస్కృత శ్లోకముల నేర్చుకొనుట అనివార్యము కాదు. రామభజనయే

చాలును. మీరు మీమీ హృదయములలో భగవంతుని నిలుపుకొనుటయే సర్వప్రార్థనలయొక్క సారము. ఇందు మీరు సాఫల్యత పొందినయెడల మీకు, సమాజమునకు, ప్రపంచమున కంతకు మేలు జరుగును.



# రాముని మోసగింపజాలము

రామనామము జపించుచూ రావణుని కార్యములుచేయుట అసమర్థతలో అసమర్థమైనపని. మనను మనమే మోసగించుకొనగలము, ప్రపంచము నంతనూ మోసగించగలముకాని రామునిమాత్రము మోసగింప జాలము.



# భగవత్ నామామృతము

ప్రార్థనలో పాడబడిన మీరాబాయి భజనకు వ్యాఖ్యానము చేయుచూ గాంధీజీ ఇట్లనెను: "ఈ భజనలో భక్తుడు ఆత్మతో పూర్ణ హృదయముతో ఈశ్వర నామామృతమును స్వీకరించుమని కోరును, మామూలుభోజనమువలన మనిషి విసిగిపోవును, అవసరమునకు మించి తినుటవలన రోగమువచ్చును కాని భగన్నామామృతమునకు అట్టి హద్దు ఏమియులేదు. మానవుడు దానిని ఎంతత్రాగిన అతనికి అంత దాహము పెరుగును. కాని అదివాని హృదయమున స్థిరమైపోవలెను. అట్లు జరిగిన మన భ్రమ, ఆసక్తి; ఈర్ష్య, ద్వేషములు అన్నియు తొలగిపోవును. పరతుఏమనగా మనము ఈప్రయత్నములో నిమగ్నమై ధైర్యము వహించి యుండవలెను. సాఫల్యమే అట్టి ప్రయత్నము యొక్క అనివార్యమైన పరిణామము.

# రామనామము-నియమ నిషేధములు

"రామనామము మనుష్యునకు రోగసమయమున సహాయపడ గలదు. కాని అందులకు కొన్ని నియమములు, నిషేధములు కలవు. ఎవరయిననూ అవసరమునకు మించి ఆహారముతిని రామనామము జపించిననూ కడుపునొప్పి యుండిన అతడు గాంధీజీని దోషిగా భావించరాదు. రామనామమును ఉచితరీతిని ఉపయోగించుకొనినగాని దాని వలన లాభమును పొందజాలము. ఎవరయిననూ రామనామమును జపించుచూ లూటీలు చేయుచుండిన అతడు మోక్షమును ఆశించలేడు. అది కేవలము ఆత్మశుద్ధి కొరకు తగిన నియమనిష్ఠలు పాలించుటకు సిద్ధపడు వారికొరకే అయియున్నది.



# రామనామము శరీరక రోగములకు ఔషధము

"రామభజన శారీరక, మానసిక రోగములకు అన్నిటి కంటె ప్రభావశాలియైన ఔషధము. ఏడాక్టరుగాని వైద్యుడుగాని మందు నిచ్చి రోగమును పూర్తిగా నివారించగలనని రూఢిగా చెప్పజాలడు. కాని మీరు భగవంతుని ప్రార్థించిన ఆయన మీ దుఃఖములను, చింతలను తప్పక నివారింపగలడు. కాని ప్రార్థనను ప్రభావశాలిగా చేయుట కొరకు మనము సద్భావనతో రామభజనలో భాగస్వామికావలయును. అప్పుడే మనకు శాంతి, సుఖము కలుగును.

ఇదికాక పూర్తిచేయవలసిన మరొక షరతుకలదు.

మనము మంచి ఆహారము తీసుకొనవలెను, చాలినంత నిద్ర పోవలెను. ఎప్పుడునూ కోపమునకు వశము కారాదు. అన్నిటి కంటె మొట్ట మొదటి విషయము మనము ప్రకృతికి అనుకూలముగా నుండి దాని నియమములను పాలించవలెను."

—o—

# రామనామము-సాధన

"ప్రబల ప్రయత్నముచేసిన మీదటకూడ హృదయపూర్వకముగా రామనామము చేయుచున్నామని చెప్పలేకున్నాము అని విశ్వాసపాత్రులైన స్త్రీ పురుషులు నాతోచెప్పిరి. వారికి నా సమాధానము: వారు ప్రయత్నముచేయుచూ ధైర్యము వహించియుండుమని. డాక్టరు అగుటకు ఒక కుర్రవానికి కనీసము పది సంవత్సరములు అభ్యాసము అవసరమగును ఇంక రామనామము హృదయమునఉంచుకొనుటకు ఎంత హెచ్చు సమయము అవసరమగును!



# రామనామము-అంతర్బాహ్య పవిత్రత

రామనామము జపించి తన అంతరాత్మను పవిత్రము చేసుకొనిన వ్యక్తి బయటి మలినమును భరించలేడు. లక్షలు కోట్లకొలది ప్రజలు పవిత్ర హృదయముతో రామనామము జపించునెడల సామాజిక రోగములయిన కొట్లాటలుజరుగవు రోగములురావు. భూమిపై రామరాజ్యము స్థాపన జరుగును.

# రామనామము యొక్క దురుపయోగము

ప్రార్థనకు తరువాత చేసిన ప్రసంగములో గాంధీజీ ప్రకృతి చికిత్సను గురించి ప్రసంగించిరి. శారీరక, మానసిక, ఆత్మసంబంధి రుగ్మతలను ముఖ్యముగా రామనామము యొక్క సహాయముతో నివారించుకొను విషయము చర్చించిరి. ఒకరు ఇట్లు వ్రాసిరి : "కొందరు అంధ విశ్వాసమువలన వస్త్రములపై ముఖ్యముగా తమ ఛాతీమీద ధరించుచుందురు. మరి కొందరు కాగితపు ముక్కలపై రామనామమును ముద్రలువేసి వాటిని తమ శరీరముపై జిలుగు అక్షరముతో కోట్ల పర్యాయములు రామనామము వ్రాసి వాటిని ఉండలుగాచేసి మింగుదురు. రామనామము వారి హృదయములకు హత్తుకొని పోయినదని వారు దృఢముగా చెప్పుదురు మరొక మిత్రుడు గాంధీజీని "రామ నామము సర్వరోగములకు ఒకే రామబాణ ఔషధమని చెప్పితిరా" అని. "ఆయన రాముడు భగవంతుని అవతారము అయోధ్యా ప్రభువగు దశరధుని పుత్రుడేనా" అని అడిగెను. కొందరు గాంధీజీ తానుస్వయముగా పొరపాటు అభిప్రాయములో నున్నారనియు, అంధ విశ్వాసములను పెంచి ఇతరులనుకూడా భ్రమలో నుంచు ప్రయత్నము చేయుచున్నారనియు అనిరి.

గాంధీజీ వీటికి సమాధానముగా ఇట్లనిరి. "ఇట్టి వ్యాఖ్యానములకు నావద్ద ఎట్టి జవాబులేదు. సత్యమును కొందరు దురుపయోగపరచునెడల, మోసగించి తమపనులు చేసుకొనుచుండు నెడల నేను వారిని ఏల లెక్కచేయవలెను అని నేను నాహృదయమున తలతును. నాకు నా సత్యముపై పూర్ణ విశ్వాసమున్నపుడు ప్రజలు నన్ను తప్పు

అర్థము చేసుకొందురనిగానిదానిని దుర్వినియోగపరతు రను భయముచే దానిని ప్రకటించుటకేల ఆగిపోవలెను? అదికూడ భగవానుని ఒక విశేషమే. మనమందరము ఒక సాపేక్ష సత్యమునే ఎరుగుదుము. అందువలన మనకు తెలిసిన విధముగా మనము మన ప్రవర్తనను ఉంచుకొనవలెను. ఇట్లు సత్యమును పాలించునెడల ఎవరునూ ఎప్పుడూ మోసగింపబడరు.

—o—

# రామనామము యొక్క మాహాత్మ్యము

"నేను ఒక నూతనమైన అంధ విశ్వాసమును ప్రచారము చేయుచున్నానా? ఈశ్వరుడు ఒక వ్యక్తికాదు. అతడు అంతటనూ ఉన్నాడు. సర్వశక్తి యుతుడు. ఎవరయినను తన హృదయములో అయనకు చోటు నిచ్చిన ఆవ్యక్తి విచిత్రమైన కోరికలతోను ఆశలతోను నిండియుండును. వానితో ఆవిరి, విద్యుత్‌చ్ఛక్తి యొక్క శక్తిపోటీ చేయజాలదు. ఆశక్తి దానికంటె చాల సూక్ష్మమైనదిగా నుండును. రామనామము ఇంద్రజాలము వంటిదికాదు. దాని సంపూర్ణార్థముతో నే దానిని గ్రహించవలయును. రామనామము స్వల్ప అన్వేషణ, ప్రయోగమునకు అందుబాటగు గణితము యొక్క సూత్రములేక ఫారమ్లా. రామనామము కేవలము నోటితో వర్ణించినమాత్రమున ఎట్టిశక్తియూ రాదు. శక్తిపొందవలెననిన బాగుగా విచారించుకొని నామముజపించవలెను. జపము యొక్కనియమములను పాలించుచూ జీవితమునునడుపుకొనవలెను. భగవంతుని నామము నుచ్చరించుటకు మనుష్యుడు ఈశ్వరమయమైన భగవజ్జీవితమును గడుపవలెను.

# నా ఆధ్యాత్మిక సాధన

మీరేమైన ఆధ్యాత్మిక సాధనలుచేసిరా అని ఒక మిషనరీ అడిగిన ప్రశ్నకు గాంధీజీ ఇట్లు చెప్పెను :

"యోగసాధనలకు నేను క్రొత్తవానిని. నేను చేయుసాధన పసి తనమున నాదాయివలన నేను నేర్చుకొనిన సాధన. ఆమె నాతో ఇట్లు చెప్పుచుండెడిది:" దయ్యములులేవు. నీవుభయపడితివేని రామనామము నుచ్చరింపుము" నాపసితనములో నేనునేర్చుకొనినది నాహృదయాకాశ ములో అతిగొప్ప విషయమైనది. నా అంధకార ఘడియలలో అది ప్రకాశమొసగిన సూర్యుడయినది. క్రైస్తవుడు జీసను నామోచ్చారణ వలన, మహమ్మదీయుడు అల్లా నామమువలన ఆదేహాయిని పొందును. వీటి అన్నిటికిని ఒకే అర్థధ్వని కలదు. అవి సమాన ఫలితముల కలుగ జేయును. ఉచ్చారణ మాత్రము పెదవుల ఉచ్చారణగాక నీలో అంత ర్భాగమై యుండవలెను.

ఇస్లాము యొక్క అల్లా క్రైస్తవుల భగవంతుడు, హిందువుల ఈశ్వరుడు అయి యున్నాడు. హిందూ మతమందు భగవంతునికి అసంఖ్యా నామములున్నట్లే ఇస్లామునందు భగవంతునికి అనేక నామ ములు కలవు. నామములు గుణములనుగాని వ్యక్తిత్వమును సూచిం చవు. వర్ణనాతీతమైన, కొలత కందని గుణములకు ఆయన అతీతుడయి ననూ అల్పమానవుడు సర్వశక్తియుతుడగు భగవంతునికి అనేక గుణ ములు కల్పించి తన అల్ప విధానముద్వారా వర్ణించియుండెను.

—o—

# రామనామ ప్రచారము

రామనామ మహిమను గురించి నేను క్రొత్తగా కొంత నేర్చుకొనుట శేషించియున్నదని నాకు అనుపించుటలేదు. ఏలనగా నాకు దాని అనుభవజ్ఞానమున్నది. అందువలన ఖాదీ, స్వరాజ్య ప్రచారము వలె రామనామ ప్రచారము జరుగవలను పడదని నా అభిప్రాయము. ఈ కష్టసమయములో రామనామమునకు వ్యతిరేక జపము జరుగును. అనగా చాలస్థలములలో కేవలము ఆడంబరముకొరకు. కొన్ని ప్రదేశములలో తమ స్వార్థముకొరకు మరికొన్ని చోట్ల వ్యభిచారముకొరకు దీని జపము జరుగుట నేను చూచితిని. దానిని తిరుగవేసిన అక్షరముల జపముచేసినను దానిని గురించి నేనేమియుఅనను. పరిశుద్ధ హృదయులగు వారు తిరుగవేసి జపము చేసికూడ ముక్తిని పొందిరని మనము చదివియుంటిమి. అది మనము అంగీకరింపవచ్చునుకూడ. కాని శుద్ధ ఉచ్చారణచేయు పాపి పాపము బలపడుటకొరకు రామనామమంత్రము చేసిన అతనిని మనమేమి చేయుదుమా? అందువలన నేను రామనామ ప్రచారమనిన భయపడుదును. భజనమండలి యందు కూర్చొని రామనామమును అదేపనిగా అనుచుండినను, అరచినను భూత, భవిష్య, వర్తమానపు సర్వపాపములు నశించిపోవుననియు మరేమియు చేయనగత్యములేదు అని చెప్పువారికి దూరమునుండియే నమస్కారము చేయవలెను, వారిని అనుకరణ చేయవీలులేదు.

అందువలన రామనామమును ప్రచారమును చేయదలచిన వారు స్వయముగా దానిని తమ హృదయములో ప్రచారము చేసుకొని శుద్ధపరచుకొనవలెను దానిపై రాముని సామ్రాజ్యమును స్థాపించుకొని దానిని ప్రచారముచేయవలెను, అప్పుడు దానిని ప్రపంచము స్వీకరించును. ప్రజలుకూడా రామనామమును జపముచేయుదురు. కాని ప్రతి

చోట ఎట్లో ఒకట్లు రామనామమును జపముచేయుట బూటకమును పెం పొందించుట నాస్తికత యొక్క ప్రవాహ వేగమును వృద్ధి పరచుట యగును.



# రామ సాధనకు గురుతు

హృదయమునుండి రామనామము వెలువడువాని గురుతుఏమి ? అంతమాత్రము మనము గ్రహించలేనిఎడల రామనామమునకు దుర్దశ ఏర్పడగలదు. మాలను ధరించి బొట్టుపెట్టుకొని రామనామమును అరచుచుండువారు అనేకులు దొరకుదురు. నేను ఎప్పుడునూ వారి సంఖ్యను పెంచుటలేను. ఇది అట్టి భయముకాదు. నేటి కాలపు మిథ్యాచారమునందు ఏమి చేయవలెను ? మౌనముగా ఉండుట మేలు కాదా ? అదియే మంచిదికావచ్చును. కాని కృత్రిమ మౌనమువలన ఎట్టి ప్రయోజనములేదు. తన్మయయుతమైన మౌనమునకు చాల తీవ్ర మైన సాధన కావలెను. అదిలేక హృదగత రామనామము యొక్క గురుతుఏమి ? దీనిని మనము శ్రద్ధగా పరిశీలింతము.

ఒక్క వాక్యములో చెప్పవలెననిన రామభక్తునకును స్థితప్రజ్ఞు నకును ఎట్టి భేదములేదు. లోతుగా విచారించిన రామభక్తుడు పంచ మహాభూతముల సేవకుడు కాగలడని మనకుగోచరమగును. అతడు ప్రకృతి నియమముల ననుసరించి వ్యవహరించును. అందువలన అతనికి ఎట్టిరోగము కలుగనే కలుగదు. కలిగిననూ అతడు పంచమహాభూత ముల సహాయముతో బాగుచేసుకొనును. ఏదోఒక ఉపాయముతో భౌతిక దుఃఖమును తొలగించుకొనుట శరీరధారి—ఆత్మ—యొక్క పని

కాదు. శరీరము యొక్క పని కావచ్చును. అందుచేత శరీరమునే ఆత్మగా తలచువారు, శరీరమునకు భిన్నముగా శరీరధారియైన ఆత్మవంటి ఏట్టి తత్వము లేదను భావము కలవారు శరీరమును జాగ్రత్తగా కాపాడుటకు ప్రపంచమంతయు తిరుగుదురు. లంకకుకూడా పోదురు. వీనికి వ్యతిరేకముగా ఆత్మ దేహమందుండియు దేహమునకు భిన్నముగా ఉన్నదనియు, అది శాశ్వతముగానుండు తత్వమనియు, అది అనిత్యమైన శరీరమునందు నివసించుచున్నదనియు, శరీరమును జాగ్రత్తగా పోషింపవలెకానీ శరీరము నశించునని భయపడనివాడు దుఃఖింపడు. దానిని సహజముగా వదలును. అట్టి దేహధారి డాక్టర్ల, వైద్యులవెనుక తిరుగడు. అతడు స్వయముగా తనకుతానే డాక్టరు అగును. అన్నిపనులు చేయుచూ కూడ అతడు ఆత్మఎడల శ్రద్ధవహించును. అతడుమూర్ఖునుండి తెలివి పొందినవానివలె ప్రవర్తించును.

అట్టివ్యక్తి ప్రతిశ్వాసతోను రామనామము జపించుచుండును. అతడు నిద్రించుచున్నను అతని రాముడు మేల్కొనును. తినుచూ త్రాగుచున్నను, ఏపనిచేయుచున్నను రాముడు అతని వెంటనే ఉండును. ఇట్టిమిత్రుని కోల్పోవుటయే మానవుని వాస్తవ మృత్యువు

ఇట్టిరాముని తనవద్ద ఉంచుకొనుటకు లేక తనను రామునివద్ద ఉంచుటకు పంచమహాభూతముల సాయము తీసుకొని సంతోషించును. అనగా అతడు మట్టి, గాలి, నీరు, సూర్యరశ్మి, ఆకాశములయొక్క సహజమైన, శుభ్రమైన, వ్యవస్థిత పద్ధతిద్వారా ఉపయోగించి పొందిన దానితో సంతోషించును. ఈ ఉపయోగము రామనామమునకు పూరకము కాదు కాని రామనామసాధనకు గురుతు. రామనామమునకు ఇట్టి సహకారులఅవసరము లేదు. కాని దానిబదులు ఒకరితరువాత మరియొక వైద్యుడు, హకీము వెనుక పరుగిడుచు రామనామమును నమ్ముచున్నట్లు చెప్పువానిమాటలు అర్థముకావు.

నామాటలు చదివి ఒకజ్ఞాని రామనామము శరీరమునుమార్చి వేయు రసాయనమని వ్రాసెను. వీర్యమును భద్రపరచుకొనుట దాచి యుంచుకొనిన ధనమువంటిది. దానినుండి అమోఘమైన శక్తిని ఉత్పన్నము చేయునది రామనామమే. కేవలము సంగ్రహము చేయుటవలన క్షయముకలుగును. ఎప్పుడైననూ అది పతనమైపోగలదు. కాని రామనామస్పర్శవలన ఆవీర్యముయొక్క గమనముమారును. ఊర్ధ్వగమనము పొందును. అప్పుడు దానిపతనము అసంభవమగును.

శరీరపోషణకొరకు పరిశుద్ధరక్తము అవసరము. ఆత్మపోషణ కొరకు శుద్ధమైన వీర్యశక్తి అవసరము. దానిని దివ్యశక్తి అనవచ్చును. ఈశక్తి సర్వఇంద్రియముల శిథిలతను సమాప్తము చేయగలదు. అందువల్లనే రామనామముహృదయములో స్థిరపడినపుడే జీవితము ప్రారంభమగునని చెప్పుదురు. ఈ నియమము వృద్ధులకు, పురుషులకు, స్త్రీలకు అందరకు వర్తించును.

పశ్చిమ దేశములందుకూడ ఈ అభిప్రాయమే కనుపించుచున్నది. క్రైస్తవశాస్త్రమను సాంప్రదాయము ఇది మాత్రమేకాదు కాని దాదాపు ఇట్టివిషయమునే చెప్పును. కాని భారతదేశమునకు అట్టిసహాయము అవుసరమేలేదని నేను భావింతును. ఏలననగా భారతదేశమున ఈ దివ్యవిద్య ప్రాచీనకాలమునుండియు వచ్చుచున్నది.



# రామనామమును హాస్యాస్పదము చేయకుందుముగాక

ప్రశ్న: కాశీయందలి రామనామబ్యాంకు. రామనామము ముద్రవేసిన వస్త్రము ఉధరించుట, లేక శరీరముపై రామనామము వ్రాసుకొనితిరుగుట, రామనామమును హాస్యాస్పదముచేయుట మనము పతనము పొందుటగాక మరేమి? అట్టిపరిస్థితులలో సర్వ రోగములకు రామబాణ ఔషధము రూపములో రామనామము ప్రచారముచేసి ఈ మోసగాండ్ర చేతులలో రాతిని ఉంచినట్లు కాదా? అంతః ప్రేరణ వలన వెలువడిన రామనామమే రామబాణము కాగలదు. అట్టి అంతః ప్రేరణ వాస్తవమైన ధార్మిక శిక్ష వలననే కలుగగలదని నేను అంగీకరింతును.

జవాబు: మీరు సరిగా చెప్పితిరి. ప్రస్తుతము మనలో స్తబ్ధత, దంభము ఎంతగా వ్యాపించినదన మంచిపని చేయుటకుకూడ భయపడవలసి వచ్చుచున్నది. కాని ఇట్లు భయపడుచూ ఉండుటవలన సత్యమును కూడా మరుగుపరచవలసి వచ్చుచున్నది. అందువలన సువర్ణ నియమమే మన దేనినిమనము సరియైనదని నమ్ముదుమో దానిని నిర్భయముగా చేయుచుండవలెను. దంభము, అసత్యము ప్రపంచమున జరుగుచునే యుండును. మనము మంచిచేయుచుండిన అది కొంత తగ్గునేకాని ఎప్పుడూ పెరుగదు. నలువైపుల అసత్యము ప్రబలుచుండినపుడు మనము కూడ అందు లీనమై మనను మనము మోసగించుకొనకుండునట్లు మనము జ్ఞప్తియుంచుకొనవలెను మనసిద్ధిలత, అజ్ఞానకారణమున మనము తెలియకయే అట్టి తప్పు చేయకుందుముగాక. ఎట్టిస్థితిలోను జాగ్రత్తగా

నుండుట మనకర్తవ్యమే. సత్యారాధకుడు మరొకటి చేయనేలేడు. రామనామము వంటి రామబాణ ఔషధమును గ్రహించుటయందు ఎల్లప్పుడు జాగ్రత్తగా నుండనియెడల రామనామము వ్యర్థమైపోవును మనము అనేక పరంతరలకు మరొకటి చేర్చినవారమగుదుము.

—o—

# సర్వరోగ నివారణి

గాంధీజీ ఇట్లనిరి: మీరు మీ మనస్సులనుండి భయమును దూరము చేసిన మీరు నాకు చాల సాయపడినట్లు నేను తలతును. [illegible] భయమునుండి పారద్రోలు వింతవిషయమేమి? అదే రామనామము అమోఘమంత్రము. రామనామమునందు మాకు విశ్వాసములేదని మే మెరుగమని మీరనవచ్చును, కాని అదిలేక మీరు ఒక శ్వాసమైనా తీసుకొనలేరు. దానిని ఈశ్వరుడనండి, అల్లాఅనండి, గాడ్ అనండి లేక అహుర్ మజ్దఅనండి. ప్రపంచములో ఎందరు మానవులున్నారో అన్ని పేర్లు ఆయనకు కలవు. ప్రపంచమందు ఆయనవలె మరొకడు లేడు. ఆయన ఒక మహనీయుడు. ప్రభువు. ఆయనకు మించినవాడు ప్రపంచమున మరెవ్వరూలేరు. ఆయనఅనాది, అనంతము, నిరంజనుడు నిరాకారుడు. అట్టివాడు నారాముడు. అతడు ఒక్కడే నాస్వామి నాయజమాని."

"చిన్నతనములో నేను చాల పిరికివాడను. [illegible] భయపడుచుండువాడను. ఆరోజులలో నా దాది [illegible] భయమును పారద్రోలుటకు రామనామ మంత్రమును [illegible] భయము కలిగిన అప్పుడు రామనామమును [illegible]

రక్షించును.' అని రంభ నాతో చెప్పెను ఆ దినమునుండియు రామ
నామము అన్నిరకముల భయములకు నా అమోఘమైన సహాయకారి
యైనది.

రాముడు పవిత్రుల హృదయములలో ఎల్లప్పుడూ ఉండును.
బంగాళములో శ్రీ చైతన్య, రామకృష్ణుల పేర్లు ప్రసిద్ధిచెందినట్లు కాశ్మీ
రమునుండి కన్యాకుమారివరకు ప్రతి గృహమునందు పరిచయముగల
భక్తశిరోమణి తులసీదాసు తన అమర కావ్యమైన రామాయణమునందు
మనకు రామనామ మంత్రము నిచ్చెను. మీరు రామనామము నెడల
భయపడుచుండిన ప్రపంచములో ఏరాజు ఏఫకీరు ఎవ్వరివలన భయపడ
నవసరము లేదు. 'అల్లాహో అక్బర్' అను కేకవలన మీరు ఎందుకు
భయపడవలెను. ఇస్లాము యొక్క అల్లా నిర్దోషుల యోగ క్షేమముల
చూచువాడు తూర్పు బంగాలులో కొట్లాటలు జరిగినవిగదా వానిని
పైగంబరుగారి ఇస్లాము అంగీకరించదు."



# రామనామము—దైవచికిత్స

అన్ని విషయములవలె నా ప్రకృతి చికిత్సాభావనను కూడ మెల్ల
మెల్లగా వికసింప జేసితిని. అనేక సంవత్సరములనుండి నా విశ్వాసము
ఎవరు తనలో ఈశ్వరానుభవము పొందెనో ఎవరికి వికారరహిత స్థితి
ప్రాప్తించినదో ఆతడు దీర్ఘ జీవనయాత్రయందు వచ్చు ఎల్లకష్టములను
జయించగలడు. నేను చూచినదానిని ధర్మశాస్త్రములలో చదివిన
దానినిబట్టి వ్యక్తియందు ఆ అదృశ్యశక్తి యెడల పూర్తి జీవిత శ్రద్ధకలిగి
నపుడు ఆతని శరీరమందు అంతరంగిక పరివర్తన ఏర్పడునను నిశ్చ

యమునకు వచ్చితిని— కాని అది కేవలము ఇచ్ఛకలిగినమాత్రమున రాదు. దీనికొరకు ఎల్లప్పుడు జాగ్రత్త, అభ్యాసము చేయవలసిన అవసరముకలదు. ఈ రెండు ఉండినను భగవత్కృప లేనిఎడల మానవ ప్రయత్నము వ్యర్థమగును.

——

# రామనామము—బ్రహ్మచర్యము

బ్రహ్మచర్య సాధనకు సూటిమార్గము రామనామము. ఇది అనుభవమునుబట్టి చెప్పగలను. తులసీదాసువంటి భక్తులు, సాధుపురుషులు ఈ రాజమార్గమును చూపిరి. నా అనుభవమునకు అవసరపు ప్రాధాన్యత ఎవరూ ఇవ్వకుందురుగాక. రామనామముయొక్క శక్తి నాకు ఉర్లీకాంచన్‌లో స్పష్టమైనదని చెప్పుట బహుశః సరియైన విషయము. సర్వరోగములకు నిశ్చితమైన నివారణ రామనామమని నేను అచట దృఢపరచితిని. దీనిని పూర్తిగా ఉపయోగించుకొనువాడు అల్ప కృషితో శక్తివంతమైన ఫలితములను చూపగలడు:

ఈ భావధార ననుసరించి హృదయములో రామనామమాసీనమై యున్న ఎడల బ్రహ్మచర్యమునకు సహాకారులైన పద్ధతులు అతి అల్పములని నేను విశ్వాసముతో చెప్పగలను. అప్పుడే దాని అతీత సౌందర్యము శక్తిని మనము అవగతముచేసుకొనగలము.

——o——

# తిరుగులేని ఓషధి రామనామము

ఆయుర్వేదమునకూడ సర్వరోగనివారణగా రామనామ మాహాత్మ్యముచెప్పబడినట్లు ఆయుర్వేదవైద్యుడు శ్రీ గణేశశాస్త్రి జోషి చెప్పియుండెను. ప్రాకృతిక చికిత్స గౌరవస్థానము వహించినది. అందు రామనామము చాల ప్రధానమైనది. చరకుడు, వాగ్భటుడు తదితర ప్రాచీన భారతదేశపు మహావైద్యులు గ్రంథరచనచేసిన కాలమున జనశ్రుతిగా భగవంతునిపేరు రామునికిగాక విష్ణువునకని వ్రాసియుండిరి. నావరకునేను చిన్నతనమునుండియు తులసీదాసునకు భక్తుడనగుటచేత రాముని భగవంతునిగా ఆరాధించితిని. ఓంకారమునుండి ప్రారంభించి అన్ని వాతావరణములలోను. దేశములలోను భాషలలోను ప్రచలితమైన భగవన్నామముల పరిశీలించిన ఫలితము ఒకటేనని నాకు తెలియును. ఆయన, ఆయనశాసనము ఒకటే. అందుచేత ఆయనశాసనమును పాటించుట సర్వశ్రేష్టమయిన ఆరాధన. ఆ శాసనముతో ఏకత్వము పొందిన వానికి నోటిద్వారా నామోచ్చారణ చేయవలసిన అవసరములేదు. మరొక విధముగా చెప్పవలెననిన భగవన్మనన దైవభావముతో శ్వాసించుట వలె సహజమయిన పక్షమున దైవశాసనమును పాలించుట అతనికి సహజమగును. అట్టివానికి ఎట్టి చికిత్సయు అవసరములేదు

ఓషధులకు రాజైన ఇది అందుబాటులో నుండగా మనకు దానిని గురించి ఇంత తక్కువగా తెలియుట ఏల, తెలిసినవారుకూడ ఆయనను జ్ఞప్తియందు ఉంచుకొనకుండుటకుగాని లేక హృదయపూర్వకముగ గాక పెదమలపాటుగా జ్ఞప్తియుంచుకొనుటగాని ఏల జరుగుచున్నది అనునది ప్రశ్న. చిలుకపలుకులవలె భగవన్నామస్మరణ చేయుట అయన సర్వవ్యాధిహరుడు అనువిషయమును గుర్తించకపోవుటయని గుర్తు.

వారు ఎట్లు చేయగలరు ? ఈ ఔషధరాజమును డాక్టర్లు గాని, ఆయుర్వేద వైద్యులుగాని, హకీములుగాని మరే ఇతర వైద్యులు గాని వాడరు. వారికి దానియందు విశ్వాసములేదు. పవిత్ర గంగ పుట్టిన చోట ప్రతి ఇంట కనుగొనవచ్చునని వారు ఆమోదించిన వారి వృత్తియేలేక జీవనాధారమే పోవును. అందుచేత వారు వారి చూర్ణముపైన, తిరుగులేని మందులు మోతాదులపైన ఆధారపడవలసి వచ్చును. ఈ మందుల డాక్టరుకు భుక్తిని కలుగజేయుటయే గాక తత్కాల విశ్రాంతినికూడ కలుగజేయునట్లు కనుపించుచున్నది, "ఫలాని వారు నాకు చూర్ణము నిచ్చిరి నాకు నయమైనది" అని చెప్పువారు కొందరు ఒక వైద్యునకు దొరికిన అతని వ్యాపారము స్థిరపడును,

దాని చమత్కృత శక్తుల విషయము వారికే గోచరము లేని ఎడల భగవన్నామమును రోగులకు ఔషధిగా నిర్ణయించుటవలన ఎట్టి ప్రయోజనము కలుగదవి మనస్సునందుంచుకొనవలెను. రామనామము కాపీ పుస్తకములో వ్రాయు మాటవంటిదికాదు. అది అనుభవ పూర్వకముగా గ్రహింపుకావలసినవిషయము. స్వానుభవము కలవాడే దానిని ఔషధిగా నిర్ణయించగలడు, మరొకడు కాడు.

ఆ వైద్యరాజు నాకొరకు కొన్ని శ్లోకములను వ్రాసిపంపెను. వాని యందు చరకుడు వ్రాసినది అతి సులువైనది. సరియైనది. విష్ణు సహస్రనామములలో ఒకదానిపైన అయినను అధికారము సంపాదించిన సర్వరోగములు అంతర్ధానమగను.

విష్ణుం సహస్ర మూర్ధానం చరాచరపతిం విభుం ।
స్తువన్ నామసహస్రేణ జ్వరాన్ సర్వాన్ వ్యపోహతి॥



# సర్వమత సమానత్వము

కొందరువ్యక్తులు పాపకార్యములుచేసిరని ఇస్లామును ఎందులకు, ఎట్లు దూషించగలము. నేను సనాతన హిందువునని దృఢముగా చెప్పుకొందును. హిందూమతము యొక్కసారము, నిజమునకు ప్రపంచ మందలి సర్వమతముల సారము సర్వమత సమానత అయియుండగా నేను పవిత్రహిందువును అయిన ఎడల పవిత్ర మహమ్మదీయుడను, పవిత్ర క్రైస్తవుడను అగుదును. తనను, తన మతమును ఇతరులకంటె హెచ్చుగాభావించుట మతభావనకు విరుద్ధము. నమ్రత అహింస యొక్క ముఖ్యమైన షరతు. భగవానునికి సహస్ర నామములుకలవని హిందూ ధర్మ గ్రంధములలో చెప్పబడి యుండలేదా? అప్పుడు అందులో రహీం ఒక నామము అయియుండకూడదా? "కలమా" కేవలము భగవంతుని ప్రశంసించును, మహమ్మదును దాని పైగంబరుగా భావించును. నేను బుద్ధుని, యురస్తు, క్రీస్తును నమ్మినట్లే భగవంతుని ప్రశంసించుటకు, మహమ్మదును పైగంబరుగా నమ్ముటకు నాకు ఎట్టి సంకోచము లేదు.

—o—

# నిజమైన ప్రకాశము

భారతదేశమందు ప్రస్తుతము రామరాజ్యము లేనందుకు నాకు విచారముగనున్నది. అందుచేత మనము దీపావళి ఎట్లు జరుపుకొనగలము. ఎవరి హృదయమున రాముడు కలడో అతడే అవిజయమునకు పండుగ జరుపుకొనగలడు. ఏలననగా మన హృదయమునకు భగవంతుడే తేజమును ప్రసాదించగలడు. ఆప్రకాశమే నిజమైన ప్రకాశము. ఈదినము పాడిన పాటయందు కనికి భగవానుని చూడవలెనను అభిలాష విషయము నొక్కి చెప్పబడినది. జనసమూహాము కృత్రిమ

ప్రకాశమును చూచుటకు పరుగిడును. కాని నేడు మనకు కావలసిన ప్రకాశము మన హృదయములలో ప్రేమ ప్రకాశము ప్రజ్వరిల్లినచో అప్పుడే అందరు కృతజ్ఞతా పాత్రులుకాగలరు. నేడు వేలాది లక్షలాది జనులు భయంకరమైన దుఃఖమును అనుభవించుచున్నారు. మీలో ప్రతి ఒకరు గుండెపై చేయివేసుకొని ప్రతి దుఃఖిత పురుషుడు, స్త్రీ—అతడు హిందువుకాని, సిక్కుకాని, మహమ్మదీయుడుగాని ఎవరైననూ— నాసహోదరుడు, సోదరిఅనిచెప్పగలరా? ఇది మీకు పరీక్ష. రాముడు, రావణుడు మంచిచెడుగుల శక్తికి మధ్య ఎల్లప్పుడు జరుగుచుండు సంఘర్షణకుచిహ్నము. నిజమైన ప్రకాశము లోపలినుండి ఆవిర్భవించును.

—o—

# మౌనభావనయందలి శక్తి

"మీరందరూ నాతోకలిసి రామనామము చేయుటకొరకు, రామనామము చేయుట నేర్చుకొనుటకొరకు, ప్రతి దినము ప్రార్థనా సమావేశములకు వచ్చుచున్నారు. కాని రామనామము కేవలము నోటి మాటలచే నేర్పవలను పడదు. నోటినుండి వెలువడు మాటలకంటె హృదయములోని మౌనభావన హెచ్చుశక్తికలిగియున్నది. ఒక సదాలోచన ప్రపంచమంతనూ వ్యాపించెంపగలదు — దానిని ప్రభావితుని చేయగలదు. అది ఎప్పుడునూ నిరర్థకమైపోదు. భావమును మాటలలోనికి లేక కర్మలోనికి మార్చుప్రయత్నమే దాని శక్తిని సీమిత పరచును. తన భావములను శబ్దమూలముననూ, కర్మమూలముననూ పూర్తిగా ప్రకటించుటలో సాఫల్యము పొందినవాడెవరు?

"అట్లయిన మానవుడు ఎల్లప్పుడూ పరిమౌనముపహించియుండరాదు అని మీరడగవచ్చును. మానవదృష్టిలో ఇది సంభవము కావచ్చు.

కాని మౌన భావము క్రియాస్థానము గ్రహించుటకుగల పరతుల పూర్తి చాల కఠినమైనది. నేను స్వయముగా నాభావనములపై సంపూర్ణ నియంత్రణ పొందగలిగితి నని విశ్వాసముగా చెప్పజాలము నేను మనస్సులో అర్థరహితమైన నిష్ప్రయోజనమైన ఆలోచనను పూర్తిగా దూరముచేయజాలను. ఈస్థితిని పొందుటకు, అంతవరకు చేసుకొనుటకు, అత్యంత ధైర్యము, మెలకువ. తపస్సు అవసరమగును.

"నేను నిన్న రామనామము యొక్క శక్తికి అంతులేదని చెప్పినపుడు నేను అలంకారభాషలో మాట్లాడియుండలేదు, వాస్తవముగనే అట్లు చెప్పవలెననియే భావించితిని. కాని ఈవిషయమును సాక్షాత్కరించుటకొరకు అత్యంతశుద్ధమైన, పవిత్రహృదయముతో రామనామము చేయుట అవసరము. నేను స్వయముగా ఈ స్థితినిపొందు ప్రయత్నములో నిమగ్నమైయున్నాను. నాహృదయములో దాని ఒక ప్రణాళిక వ్రాయబడీయున్నది. కాని దానిని పూర్తిగా అమలు జరుపలేకున్నాను. ఆస్థితి వచ్చినపుడు రామనామము జపించుటకూడ అనావశ్యకమగును.

"నా అనుపస్థితియందు కూడ మీరు మీమీ ఇండ్లలో వేరు వేరుగనూ ఒకచోట సమకూడియు రామనామము చేయుదురని ఆశించుచున్నాను అందరితోకలసి సామూహికప్రార్థనచేయుటలో రహస్యము అందువలన ఒకరివలన మరొకరికి కలుగు శాంతియొక్క ప్రభావము ఆధ్యాత్మిక ఉన్నతియొక్క మార్గమున సహాయకారి కాగలదు.



# రామనామము - జాతీయసేవ

నేటి కాలపు తార్కికులకు భగవన్నామముచేసిన ఏదో ఒక ఉత్కృష్టస్థితిని పొందవచ్చుననుటలో విశ్వాసము ండదు. వారు స్థూల సంబంధమైన లాభములకొరకు అహర్నిశలు ప్రయత్నించుచునూ అవి తమ శరీర, బుద్ధి శక్తులద్వారా పొందగలమని ఆశించుచుందురు. భగవత్ చింతనకు, జాతీయసేవకు, సంబంధము కలదనిన వారికి హాస్యాస్పద ముగా నుండును. అట్టి సంశయాత్ములకు సమాధానముగా గాంధీజీ ఇట్లు చెప్పెను

"ఎవరి అభివృద్ధికైననూ ప్రయత్నము అవసరమని నా వినమ్రమైన అభిప్రాయము. అదిఫలితములకు సంబంధము లేనిదిగా ఉండ వలెను. రామనామముగాని, దానికి సమానమైన మరొకటిగాని అవ సరము అది కేవలము ఉచ్చరించుటకొరకు మాత్రముగాక ప్రయత్న మునకు సహకారిగాను, పైనుండి సూటిగా మార్గ దర్శకత్వము కొర కును ఉపకరించును. కాన అది ప్రయత్నమునకు ప్రత్యామ్నాయముగా నుండరాదు. అది వేగపరచుటకు, సక్రమమార్గమున నడపుటకు అయి యున్నది. ప్రయత్నమంతయు నిష్ప్రయోజనమైన కౌటుంబిక భాధ లేల ? లేక పేదలకు అప్పుడపుడు సహాయపడుటఎందులకు ? ఈ ప్రయ త్నములోనే జాతీయసేవయొక్క బీజము ఇమిడియున్నది. జాతీయ సేవఅనగా నాభావము మానవసేవ. నిర్లిప్తమైన కుటుంబసేవకుకూడ అర్ధమదియే. కుటుంబమునకు చేయు నిర్లిప్తసేవ తప్పక జాతీయసేవకు మార్గమగును. రామనామము నిర్లిప్తతను, చంచలతలేకుండ చేయు నదిగాను ఉండి సందిగ్ధ సమయములందు తొట్రుబాటు లేకుండచేయును. ఆత్మ సాక్షాత్కారము కడు బీదవారితో తాదాత్మ్యత పొందకయు, వారికి సేవచేయకయు అసంభవము.

# రామనామము నిజమైన ప్రాకృతిక చికిత్స

మానవునికి సహజమైనది ప్రాకృతిక చికిత్స అని అర్థము. 'మానవుడు' అనగా అర్థము పశువువంటి మనిషి మాత్రము కాదు. శరీరము మాత్రముగాక మనస్సు, ఆత్మ కలిగియున్న జీవి అని అర్థము. అట్టి జీవికి రామనామమే వాస్తవిక ప్రకృతిచికిత్స. అది విఫలముకాని నివారణ. రామబాణము లేక తిరుగులేని నివారణ అనునది దాని నుండి ఉత్పన్నమైనదే. మానవునికి అదియోగ్యమైన చికిత్సఅని ప్రకృతి సూచించును: మానవుడు ఏ రోగమువలన బాధపడుచున్నను హృదయమునుండి వచ్చిన తిరుగులేనిచికిత్స. భగవంతునికి అనేకనామములు కలవు. ప్రతివ్యక్తి తనకు నచ్చిన పేరును ఎన్నుకొనవచ్చును. ఈశ్వరుడు, అల్లా, ఖుదా, దేవుడు ఒకడే. కాని ఉచ్చారణ చిలుక పలుకులుగా ఉండరాదు అది విశ్వాసజనితము కావలెను. అట్టి ప్రయత్నమునకు రుజువు ఉండవలెను. మానవుడు పరిశీలించి శరీరము నిర్మాణముచేయబడిన పంచభూతములయినభూమి, నీరు, ఆకాశము, తేజము, గాలియే నివారణ సాధనములుగ తృప్తిచెందవలెను. రామనామము తప్పనిసరియైన సహకారియగుటసరియే. ఇదిజరిగినపిదపకూడ మృత్యువు అధిగమించిన మనము లక్ష్యపెట్టరాదు. అందుకు భిన్నముగా దానిని ఆహ్వానించవలెను. శరీరమును చిరంజీవిగా చేయుటకు విజ్ఞానము శాస్త్రము ఏ పద్ధతిని కనుగొనలేదు. చిరంజీవిత్వము ఆత్మకుగల ఒక గుణము. అది అవినాశియనుట దృఢము. దీని పవిత్రతను గుర్తించి చెప్పుచుండుట మానవునివిధి.

పైన చెప్పిన తర్కమును అంగీకరించిన ప్రకృతి చికిత్సయొక్క సాధనములను సీమితము చేసినట్లు అగును. మానవుడు పెద్ద వైద్యాలయములు, వైద్యుల బాదరబందీ నుండి రక్షింపబడును. ప్రపంచమందు అధిక సంఖ్యాకులు వీటిని భరించలేరు. అట్టి ఎడ హెచ్చుమంది పొందలేనిది కొద్దిమంది కోరుటఏల ?"

—o—

# ప్రకృతి చికిత్సయందు రామనామము

రామనామము ప్రకృతి చికిత్సకుని ఆయుధములలో శక్తియుతమైన ఆయుధము. దీనిని గురించి ఎవ్వరూ ఆశ్చర్యపడకుందురు గాక. ఒక ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యుడు మొన్న నాతో "నా జీవితమంతయూ నేను ఓషధులను ఉపయోగించుచుంటిని. శరీర రుగ్మతలకు నివారణగా రామనామమును మీరు ఓషధ నిర్ణయముచేయగా మీరు చెప్పినదానికి వాగ్భట, చరకములలో ధ్రువతకలదని నాకుస్ఫురించినది." అని అనెను. ఆధ్యాత్మిక రుగ్మతలకు రామనామ స్మరణ ఒక నివారణోపాయముగా ఉపహరించుట పర్వతములవలె ప్రాచీనమైనది. గొప్పలో తక్కువకూడ ఇమిడియున్నది. రామనామస్మరణ శారీరక రోగములకుకూడ రాజవైద్యమని నేను చెప్పుదును. ప్రాకృతిక చికిత్సకుడు రోగితో నన్ను ఆహ్వానింతును, నేను నీరోగమును నివారింతును—అని చెప్పడు. ప్రతిజీవియందును గల సర్వనివారణ మాత్రమును, దానిని చైతన్యపరచి ఎవరికివారు నివారించుకొనగల దానిని జీవితమునందు చైతన్యశక్తిగా చేసుకొను విధానమునుమాత్రము చెప్పును. భారత దేశము ఆ విధానమందలి శక్తిని గ్రహించగలిగిన మనము విముక్తి

పొందుటయేగాక మనము ఆరోగ్యవంతుల దేశవాసులమగుదుము. కాని నేటివలె అంటువ్యాధుల, అనారోగ్యపు దేశీయులముగ నుండజాలము.

రామనామముయొక్క శక్తి కొన్ని షరతులకు నియంత్రణలకు లోబడియుండును. రామనామముగారడి చేయుటవంటిదిగాదు. హెచ్చు తినుటవలన కలిగిన గుప్పలముల తొలగించి మరల బాగుగా తినుటను కోరు తిండిపోతునకు రామనామము ప్రయోజనములేదు. రామనామము కేవలము మంచికొరకే ఉపయోగపడునుగాని, చెడుగున కెన్నటికినికాదు. అట్లు కానిఎడల దొంగలు, బందిపోట్లు గొప్పభక్తులైయుందురు. రామనామము పవిత్ర హృదయులకు, పవిత్రతను పొంది పవిత్రులుగా నుండగోరువారికి, భోగలాలసతకొరకు అది ఆధారము కాజాలదు. అతి భోజనమునకు నివారణ ఉపవాసముగాని ప్రార్థన కాదు. ఉపవాసము తన పనిని తానుచేసిన పిదప ప్రార్థనవచ్చును. అది ఉపవాసమును సులువు, భరింపయోగ్యము, చేయును. నీ శరీరమును మందులతో నింపుచున్నపుడు రామనామము అర్థరహిత హాస్యము అగును. రోగియొక్క దుర్గుణములకు సాయపడుటకొరకు తన నైపుణ్యము నుపయోగించు వైద్యుడుతనను, తనరోగిని అధోగతి పాలుచేసిన వాడగును. శరీరమును తన సృష్టికర్తయొక్క పూజకైగాక పొగడ్తవస్తువుగను, దానిని ఎట్లో జీవింపజేయుటకు ధనమును నీటివలె వ్యర్థముచేయుట కంటె మరొకపతనము ఏమికలదు? అట్లుగాక రామనామము రోగ నివారణ చేయుచూ పవిత్రపరచును అందుచేత అది ఉన్నతిని చేకూర్చును. దాని యొక్క ఉపయోగము, హద్దు అచటనే యున్నది.



# బాల్యమున నాటబడిన సద్బీజ ఫలము "రామ్! రామ్"

గాంధీజీ తన 'ఆత్మకథ' యందు తనకు రామనామముతో ఎట్లు పరిచయమేర్పడినది చెప్పుచూ తన జీవితలక్ష్యమును ఈ విధముగ వివరించెను.

"నా దాది రంభ నాకుగల దయ్యముల, భూతముల భయ నివారణగా రామనామ జపము నాకు సూచించెను. అందుచే భయ నివారణకు అతి బాల్యము నుండియే రామనామ ఉచ్చారణ ప్రారంభించితిని. పసితనమున నాటబడిన ఈసద్బీజము నిష్ఫలముగా నాటబడలేదు."

"నేను సత్యమునే భగవంతునిగా ఆరాధింతును. నేను ఇంకనూ ఆయనను కనుగొనలేదు. కాని ఆయనకొరకై వెదకుచున్నాను. ఈ కృషిలో నాకు అతిప్రియమైన వస్తువులనుకూడ నేను త్యాగము చేయుటకు సిద్ధముగా నున్నాను. ఆ త్యాగము నా ప్రాణమునే కోరునెడల నేను దానిని ఇచ్చుటకు వెనుదీయనని భావించుచున్నాను"

తన సంకల్పమునకు తాను నమ్మిన సత్యమునకుఅనుకూలముగా గాంధీజీ తాను ఎట్లు ప్రాణమునొడ్డెనో, చిన్ననాడు తన దాదినాటిన "రామనామ" సద్బీజము మొక్క, వృక్షమై ఫలించినదో చూతము. అంత్యకాలమున భగవన్నామము ఉచ్చరించుచూ ప్రాణములు వదలుట జీవితసాఫల్యత పొందుటయనియు అట్టివ్యక్తి మోక్షమను జన్మరాహిత్య స్థితిని పొందునని ఆయన అంత్యసమయ ఘటన తెల్పును.

ఆదినం జనవరి 30వ తేది. సాయంసమయము. గాంధీజీ ప్రార్థనా సమావేశమునకు తనకు వదలబడిన మార్గముద్వారా నడచుచుండెను.

తన రెండుచేతులూ ఇరువురు బాలికల బుజములపై ఆధారముగొని నడచుచూ ప్రార్థనకై గుమిగూడిన ప్రజల నమస్కారములకు చిరునగవుతో ప్రతి నమస్కారముచేయుచూ పోవుచుండెను. గుంపునుండి ఒక వ్యక్తి గుంపును భేదించుకొని త్రోవలోనికి వచ్చెను. గాంధీజీకి ఎడమ వైపున ఆయనకు ఆధారము నిచ్చుచున్న బాలిక "మను" ఆ వ్యక్తిని చూచి ఆతడు గాంధీజీ పాదస్పర్శచేయుటకు వచ్చుచున్నాడనితలచెను. ప్రార్థనకు ఆలస్యమగునేమోనని ఆమె అతనిని నివారింపబోగా ఆవ్యక్తి ఆమెను ఒక్కత్రోపుత్రోసెను. ఆమె చేతియందలి ఆశ్రమ ప్రార్థనావళి, మాల, క్రిందపడెను. ఆమె వంగి వాటిని తీసుకొనుచుండగా ఆ వ్యక్తి గాంధీజీ ముందుగా దగ్గరగానిలబడి లోపలదాచిన పిస్తోలునుతీసి మూడు పర్యాయములు పేల్చెను. మొదటి గుండు బొడ్డునకు 2 1/2 అంగుళములపైగా కుడివైపున తగిలెను. రెండవగుండుకూడ మధ్యరేఖకు కుడి వైపుననే తగిలెను. ఈ రెండు గుండ్లు శరీరముగుండా వెళ్ళి వీపుగుండా దూసుకొని బయటికివెళ్ళెను. మూడవగుండు గుండెకు కుడివైపునతగిలి ఊపిరితిత్తులలో చిక్కుకొనిపోయెను. మొదటి రెండుగుండ్లు తగిలినంత వరకు బాపూ నిలబడియేయుండెను. మూడవగుండుతగులగనే "రామ్, రామ్," అనుచూ క్రిందికి వరిగెను. కొంచెము సేపటికి ప్రాణపక్షి ఎగిరిపోయి తనస్వస్థానమున శాశ్వతమున కలసిపోయెను. ఇదేమోక్షము.

ఆత్మకథయొక్క ఉపోద్ఘాతమునందు బాపూ ఇట్లువ్రాసెను. "నేను ఆత్మసాక్షాత్కారమును, భగవంతుని ముఖాముఖి చూచుటను అనగా మోక్షమును పొందగోరుచున్నాను. నేను ఈ లక్ష్యసాధనకే బ్రతుకుచున్నాను, తిరుగుచున్నాను. నేను మాట్లాడుచున్నది వ్రాయుచున్నది, రాజకీయ రంగమునందు నేనుచేయు ప్రతిసాహసము ఈలక్ష్య సాధనకొరకే చేయుచున్నాను."

బాల్యమున తనకు లభించిన రామనామమే గాంధీజీకి నావయై అనేక ఒడుదుడుకు, తుఫాను సాగరములదాటించి వృద్ధాప్యమువరకు రక్షించి ఆయనను గమ్యస్థానము చేర్చినదిగదా! భగవన్నామము భవ సాగరమును దాటించి జీవితసాఫల్యతను చేకూర్చగలదనుట నిస్సంశయ మని గాంధీజీ ఋజువు చేసెనని ప్రతివారును అంగీకరింతురు.



## "రామనామమే సత్యము"

వైష్ణవజన తోతేనే కహియే, జేపీడ పరాఈ జాణేరే :
పరదుఃఖే ఉపకార కరేతోయే, 
మన అభిమాన న ఆణేరే॥ 
సకలలోకమా సహునే వందే, నిందానకరే కేనీరే :
వాచ కాచ మన నిశ్చలరాఖే ధన ధన జననీ తేనీరే॥
సమదృష్టి నే తృష్ణాత్యాగీ, పరస్త్రీ జేనే మాతరే,
జిహ్వాథకీ అసత్య న బోలె, పరధన నవఝాలే హాథరే॥
మోహ మాయా వ్యాపే నహి జేనే,
దృఢవైరాగ్య జేనా మన మారే 

రామనామ శుం తాళీ లాగీ, సకల తీరథ తేనా తనమారే॥
వణలోభీనే కపట రహిత ఛే, కామక్రోధ నివార్యారే,
భణే నరసైంయో తేనుం దరసన
కరతాం, కుళ ఏకోతేర తార్యారే॥

[ సంపూర్ణము ]